Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

కాకమ్మగారి సంధ్యావందనాలు

పంపినవారు :
వై. ఇందిరారెడ్డి, చిత్తూరు.

రాబోవు సంచిక

# చందమామ

## దీపావళి ప్రత్యేక సంచిక

రెట్టింపు పేజీలతో ఆకర్షవంతంగా వెలువడనున్నది.



★ నవరసభరితములైన కథలు

★ నవనీతతుల్యములైన గేయాలు

★ రంగురంగుల చిత్రాలు

★ రమణీయమైన మల్టికలర్ అఫ్‌సెట్ ముఖచిత్రం

★ చమత్కారమైన హాస్యరచనలు

★ చక్కని వార్తలు, విశేషాలు, వైజ్ఞానిక విషయాలు.

**వెల 12 అణాలు**



ఆర్డర్లు పంపని ఏజెంట్లు వెంటనే పంపండి.
అలస్యంచేసిన కాపీలు రిజర్వు చేయజాలము.

ఈ ప్రత్యేక సంచిక కాపీలు, మామూలువలె గాక రూ. 4 లకు 7 కాపీల చొప్పున చిన్న చిన్న ఏజెంట్లకు పంపబడగలవు.

సర్క్యులేషన్ మేనేజరు,
చందమామ పబ్లికేషన్స్
మద్రాసు - 26.

# చందమామ

## ఈ సంచికలో



ఇవిగాక:

ఇంకా హాస్యకథలు, రంగులబొమ్మ కథ - ఫోటో శీర్షికల పోటీ, చిత్రకథ, వార్తలు - విశేషాలు మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

"చందమామ"లో పాఠకులు పంపే కథలూ, హాస్యాలూ బాగుంటే వేసుకుంటాము. "చందమామ"లో ప్రచురణార్థం పాఠకులు మంచి బొమ్మలనూ, కార్టూనులనూ, కార్టూను కథలనూకూడా పంపవచ్చు. రచనలూ, బొమ్మలూకూడా స్వతంత్రంగా రచించినవై ఉండాలి.


చందా వివరములు:

చందమామ (ఏ భాషలోనైనా)

విడి సంచిక 0-6-0 సంవత్సర చందా రు. 4-8-0




# పెర్టుసిన్

"టెష్‌నర్"




అరవై సంవత్సరములపైనుంచి అన్ని విధములయిన దగ్గులతో, కోరింత దగ్గుతోసహా, బాధపడుచున్న వారికి, పెర్టుసిన్ త్వరితముగాను, క్షేమముగాను స్వస్థత చేకూర్చినది. పెర్టుసిన్ కొనుడు!

అందరు కెమిస్టుల వద్దను లభించును

ఎటెఫా లిమిటెడ్, షాన్ లీచ్‌టెన్‌స్టెయిన్, స్విస్ కస్టమ్ అండ్ ఏకనామిక్ టెర్రిటరీ వారితో చేసుకున్న ఒడంబడిక ప్రకారము, యిండియాలో ఇన్‌ఫా లిమిటెడ్, పోస్టు ఆఫీసు బాక్సు నెం. 1041, బొంబాయి-1 వారిచే తయారయినది.

II.Y-7-TEL

## చందాదారులకు మనవి

★

పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

---

ఈ సంచికలో ప్రచురింపబడిన 'సరికొత్త శ్లోకం' అనే కథ మన పూర్వ చక్రవర్తుల సారస్వతాభిమానాన్నే కాక, కవి పండితుల్లో వుండే అసూయనూ, మాత్సర్యాన్నీకూడా తెలియపరుస్తుంది. భోజుడు ఎంత గొప్ప, కవి పండిత పోషకుడైనా, ఆయన ఆస్థానంలో చోటు సంపాయించుకున్న ఏక, ద్వి, త్రి సంధాగ్రాహుల్లాంటి అసూయాపరులవల్ల, భోజుని దాతృత్వం నిరుపయోగం అయిపోయింది. అలాంటి పరిస్థితుల్లో మహాకవి కాళిదాసు కల్పించుకుని ఏక ద్వి త్రి సంధాగ్రాహుల ఆటకట్టించాడు. ఈవిధంగా భోజుడు తసవద్దనున్న పండితులలో అసూయాపరు లెవరో తెలుసుకోగలగటమేకాక, ఆ శ్లోకం రచించిన కాళిదాసు ఎక్కడ వున్నదీ గుర్తించి, ఆయనను తిరిగి తన ఆస్థానానికి తెచ్చుకో గలిగాడు.



అక్టోబరు
1955

సంపుటి 17
సంచిక 4

# డేగా - గుడ్లగూబా



డేగతోను గుడ్లగూబ
ఒకనా డిలా అంది:
"మనం చేసుకోవా లొక
నిరాక్రమణ సంధి!

ని పిల్లలు కనబడితే
నేను చంపకూడదు;
నా పిల్లలు కనబడితే
అటు వేపే చూడకు."

డేగన్నది, "బాగున్నది
నువు పెట్టిన షరతు!



అయితే నాకేం తెలుసును
నీ పిల్లల గురుతు ?"

"వర్ణిస్తా, వినుము నా
పిల్లల వివరాలు:
మిలమిలలాడే జ్యోతులు,
మెరిసే రతనాలు;

అందంలో చందంలో
సాటిలేని చుక్కలు;
పందిరి మల్లియలు, పటిక
పంచదార ముక్కలు"

సంధికి డేగా, గూబా
సమ్మతి తెలిపాయి.





(గేయ కథ)

అని వాటినిమింగి డేగ
పట్టెను తన రస్తా.
గుడ్లగూబ సాయంత్రం
గూడు చేరుకోగా
ఘోరమాయెనని యెరింగి
గోలచేసె బాగా!

తన పిల్లలమీద తనకు
తగని ప్రేమ తప్పు!
తప్పుగురుతు చెప్పడమే
తెచ్చెనింత ముప్పు!

అనుకున్నది గుడ్లగూబ
తనకేనని హాయి.

ఆ మరుసటిరోజు డేగ
కాకలి వేసింది.
గుడ్లగూబ గూటిలోని
కూనల చూసింది.

"ఇవి నా ప్రియమిత్రుని సం
తానంలా తోచదు;
అందమైనవి, ఇవో వి
కారమైన బూచులు!

అందుచేత వీటిని ఫల
హారం చేసేస్తా"





# అట్టివీ ది బొమ్మ

పూర్వం ఇంద్రద్యుమ్ను డనే మహారాజు భూమిపై ఎన్నో పుణ్యకార్యాలుచేసి, చచ్చినవెనక స్వర్గానికివెళ్లి అక్కడ చాలా కాలం స్వర్గసుఖాలు అనుభవించాడు. చివరకు స్వర్గంలోని దేవతలు ఇంద్రద్యుమ్నుణ్ణి భూలోకానికి తోసివేశారు.

మానవులు చేసుకున్న మంచికర్మను గురించి భూమిమీద చెప్పుకున్నంత కాలమూ వారు స్వర్గంలో ఉండవచ్చు. అందుచేత ఇంద్రద్యుమ్నుడు, చిరంజీవి అయిన మార్కండేయుడివద్దకు వచ్చి, "మునీశ్వరా! నేను ఇంద్రద్యుమ్ను డనేవాణ్ణి! నన్ను గురించి ఎప్పుడైనా విన్నావా?" అని అడిగాడు. "వినలేదు, బాబూ!" అన్నాడు మార్కండేయుడు. "పోనీ నీకన్న ఎక్కువకాలంగా జీవించిఉన్నవా రెవరన్నా ఉన్నారా?" అని అడిగాడు ఇంద్రద్యుమ్నుడు.

"హిమాలయంమీద ప్రావారకర్ణం అనే గుడ్లగూబ ఉన్నది" అన్నాడు మార్కండేయుడు. ఇంద్రద్యుమ్నుడు ఒక తెల్లగుర్రంరూపు ధరించి, మార్కండేయుణ్ణి తన వీపుపైకి ఎక్కించుకుని, హిమాలయానికి వెళ్ళి, గుడ్లగూబను కలుసుకుని, "నన్నెరుగుదువా?" అని అడిగాడు. గుడ్లగూబ కొంచెం ఆలోచించి, "ఇంద్రద్యుమ్నుడనే పేరు వినలేదుగాని, ఇక్కడికి దగ్గర లోనే 'ఇంద్రద్యుమ్న' మనే సరస్సున్నది. అందులో నాకన్న ముందుపుట్టిన నాడీజంఘుడనే కొంగ ఉన్నది. దానినడిగితే తెలుస్తుంది!" అన్నది. ఇంద్రద్యుమ్నుడు గుడ్లగూబనుకూడా మీద ఎక్కించుకుని ఇంద్రద్యుమ్నమనే సరస్సు దగ్గిరికి వెళ్ళి నాడీజంఘుణ్ణి కలుసుకున్నాడు.

"ఇంద్రద్యుమ్నుడిపేరు నేనైతే వినలేదుగాని, ఈ సరస్సులో నాకన్న ముందుపుట్టిన తాబేలొకటి ఉంటున్నది. దాన్ని అడిగిచూడండి!" అన్నది కొంగ.

తాబేలును బయటికి పిలిచి, "ఇంద్రద్యుమ్నుడనే రాజునుగురించి ఎప్పుడైనా విన్నావా?" అని అడిగేసరికి, తాబేలు కంటనీరు పెట్టుకుని, "ఇంద్రద్యుమ్నుణ్ణి ఎరగకపోవటమేమిటి? ఆయన ఇక్కడ వెయ్యి యజ్ఞాలుచేశాడు. ఆయన దానం ఇచ్చిన గోవుల తొక్కిడికి ఈ కొలను ఏర్పడింది" అన్నది.

తాబేలు ఈ మాట అనగానే దేవతలు ఇంద్రద్యుమ్నుడికోసం విమానం పంపారు. ఇంద్రద్యుమ్నుడు కొంగనూ, గుడ్లగూబనూ, మార్కండేయుణ్ణీ వారి వారి స్థానాలలో దిగవిడిచి, విమానంలో స్వర్గానికి తిరిగివెళ్ళాడు.




బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో బోధిసత్త్వుడు గొప్ప ధనికుడుగా పుట్టాడు. ఆయన పెరిగి పెద్దవాడై పెళ్ళి చేసుకున్నాడు. కొంతకాలానికి ఒకరోజున బోధిసత్త్వుడి కొక కుమారుడు కలిగాడు. అదే రోజున ధనికుడి ఇంటి దాసీదానికి కూడా ఒక మగపిల్లవాడు పుట్టాడు. వాడికి కటాహకుడు అని పేరు పెట్టారు.

ధనికుడి కుమారుడూ, దాసీ పుత్రుడైన కటాహకుడూ పెరిగి పెద్దవాళ్ళు కాసాగారు ధనికుడి కుమారుడు చదవటానికి వెళ్ళేటప్పుడు కటాహకుడు అతని పలకా పుస్తకాలు తీసుకుని వెంట వెళ్ళివస్తూండేవాడు. ధనికుడి కొడుకు నేర్చుకున్న చదువంతా దాసీ పుత్రుడూ నేర్చుకున్నాడు.

చదువుకున్నవాడనీ, తెలివిగలవాడనీ కటాహకుడికి పేరువచ్చింది. అన్నీ వుండి కూడా తాను నౌకరు స్థాయిలోనే వుండటం కటాహకుడికి ఏమీ నచ్చలేదు. తన విద్యకూ తెలివితేటలకూ తగిన స్థాయి సంపాదించాలని వాడికి కోరిక పుట్టి ఇందుకుగాను ఒక ఉపాయంచేశాడు.

కాశీకి కొన్నిమైళ్ళ దూరాన ప్రత్యంత దేశంలో బోధిసత్త్వుడి మిత్రుడొక లకోధికారి ఉన్నాడు. అతనికి తన యజమాని రాసినట్టుగా కటాహకుడొక జాబురాశాడు :

"నేను నా కుమారుణ్ణి తమవద్దకు పంపుతున్నాను. మనమూ మనమూ వియ్యమందటం ఉచితంగా వుంటుందని నా విశ్వాసము. కనుక తమరు మావాడికి తమ కుమార్తెనిచ్చి వివాహముచేసి తమ యింటనే వుంచుకొనేది. తీరికచేసుకుని నేనువచ్చి తమ దర్శనం చేసుకోగలను."

ఈవిధంగా ఉత్తరం రాసి కటాహకుడు దానిమీద తన యజమాని ముద్రిక వేసి, యజమాని ఖజానానుంచి తనకు కావలసి





ఇంత అనాగరికత ఎక్కడా చూడలేదు,'' అంటూ చీదరించుకునేవాడు.

ఈలోపల బోధిసత్వుడికి కటాహకుడే మైనాడా అని సందేహం వచ్చింది. అతని జాడ ఎవరికీ తెలిసినట్టు కనబడలేదు. అందుచేత ఆయన అతన్ని వెతకటానికి నాలుగువైపులా మనుషులను పంపాడు. వారిలో ఒకడు ప్రత్యంతదేశం వెళ్ళి, కటాహకుడు ఒక లక్షాధికారి కూతుర్ని పెళ్లాడి, తన పేరు మార్చుకుని, తాను ఫలాని కాశీధనికుడి కుమారుణ్ణని చెప్పుకుంటున్నట్టు తెలుసుకున్నాడు.

ఈ వార్త తెలియగానే బోధిసత్వుడు చాలా నొచ్చుకున్నాడు. తాను స్వయంగా వెళ్లి కటాహకుణ్ణి తీసుకువద్దామని ప్రత్యంత దేశానికి బయలుదేరాడు. ఆయన వస్తున్నాడన్న వార్త తెలియగానే కటాహకుడు బెదరిపోయాడు. అతను పారిపోదామని ఆలోచించాడుగాని అందువల్ల తనకు నష్టమేగాని లాభం కలగదు. అంతకంటె తన యజమానిని మంచిచేసుకోవటమే సరిఅయినపని.

తన యజమాని వచ్చిచేరి నిజం తెలుసుకోకముందే తాను ఆయనను మంచి చేసుకుని జరిగినదంతా చెప్పేసి క్షమాపణ వేడు

నంత ధనం సంగ్రహించి ప్రత్యంతదేశానికి వెళ్ళి, లక్షాధికారి దర్శనం చేసుకుని ఆయనకు ఉత్తరం అందించాడు. లక్షాధికారి ఉత్తరం చూసి ఉబ్బితబ్బిబ్బయిపోయి, కటాహకుడికి తన కుమార్తెనిచ్చి పెళ్ళి చేసేశాడు.

కటాహకుడి కిప్పుడు అంతులేని నౌకర్లు. దుస్తుల విషయంలో భోజనం విషయింలో, ఇతర విలాసాల విషయంలో అతనికి రాజోపచారంగా జరిగిపోతున్నది. అయినా వాడు నిత్యమూ, ''ఛీ, ఛీ! ఈ ప్రత్యంత దేశ ప్రజలు ఏమీ నాగరికత అన్నది ఎరగరు? ఇదేం భోజనం? ఇవేం దుస్తులు?



కుందామనుకున్నాడు. అయితే తాను యజమానిదగ్గిర నౌకరులాగా ప్రవర్తించటం చూసి అందరూ అనుమానపడ వచ్చు. అందుచేత కటాహకుడు తన సేవకులతో, "నేను అందరి కొడుకులవంటి వాణ్ణికాను. నాకు నా తండ్రిమీద యెంతో పూజ్యభావం. నేను నా తండ్రి భోజనం చేస్తూంటే పక్కన నిలబడి విసురుతాను. ఆయనకు మంచినీరూ అవీ అందిస్తాను," అంటూ తాను నౌకరుచేసే విధులన్నీ వర్ణించి చెప్పాడు.

తరవాత కటాహకుడు తన మామగారి వద్దకు వెళ్ళి, "మా నాన్న వస్తున్నాడు. నేనాయనకు ఎదురువెళ్ళి తీసుకొస్తాను!" అని చెప్పాడు. లక్షాధికారి సరేనన్నాడు.

కటాహకుడు తన యజమానిని అంత దూరానే కలుసుకుని ఆయన కాళ్ళమీద పడి, తాను చేసినదంతా చెప్పి, తనకు అపాయం రాకుండా కాపాడమని అభయం కోరాడు. బోధిసత్వుడు అభయం ఇచ్చాడు. తరవాత కటాహకుడు బోధిసత్వుడితోసహా మామగారి ఇంటికి వచ్చేశాడు.

లక్షాధికారి బోధిసత్వుణ్ణి చూసి ఆనంద పడి, "తమరు కోరినప్రకారమే మా అమ్మాయిని మీవాడికిచ్చి పెళ్ళిచేశాను," అన్నాడు. బోధిసత్వుడు తృప్తిపడ్డట్టు కనిపించి,



కటాహకుడితో, తన కుమారుడితోలాగే, మాట్లాడాడు. తరవాత ఆయన లక్షాధికారి కుమార్తెను పిలిచి, "అమ్మా, నా కుమారుడు నిన్ను సరిగా చూసుకుంటున్నాడా?" అని అడిగాడు.

"ఆయనలో మరే లోపం లేదుగాని, భోజనందగ్గిర ఆయనకు ఒకటీ రుచించదు. ఎన్నివిధాల వంటకాలు చేసినా తప్పులు పడతారు. ఏంచెయ్యాలో తెలియకుండా వుంది" అన్నది కటాహకుడి భార్య.

"అవును. వాడు తిండిదగ్గిర నానా తిప్పలూ పెట్టేవాడే. అందుచేత ఈసారి భోజనానికి కూచుని, ఇది బాగాలేదు, అది బాగాలేదు, అన్నప్పుడు ఒక శ్లోకం చదువు. ఆ శ్లోకం నీకు రాసిస్తాను, దాన్ని వల్లె వెయ్యి! అది చదివినావంటే వాడు తప్పులు పట్టటం మానేసి, పెట్టినదేదో తింటాడు," అంటూ భోధిసత్వు డామెకు ఒక శ్లోకం రాసి యిచ్చాడు.

తరవాత బోధిసత్వుడు కాశీనగరానికి తిరిగి వెళ్ళిపోయాడు. వెంటనే కటాహకుడు మరింత విజృంభించాడు. భోజనం ముందు కూచుని వడ్డించిన ప్రతివస్తువునూ నిందించసాగాడు. వెంటనే అతని భార్య ఈ విధంగా చదివింది:

"బహుంపి సో వికత్థేయ్య అంఞం
జనపదం గతో,
అన్వాగంత్వాన దూసేయ్య భుంజ
భోగే కటాహక."

(కటాహకుడు అనేకవిధాల తిట్లుతిని వేరొక చోటికిపోయి ఇతరులను దూషిస్తూ సకల భోగాలు అనుభవిస్తాడు.)

దీని అర్థం ఆమెకు తెలియదు. కాని కటాహకుడు మాత్రం, తన యజమాని తన పేరుతోసహా తన రహస్యమంతా భార్యకు చెప్పేశాడనుకున్నాడు. ఆతరవాత అతను ఏది వడ్డిస్తే అది తిని సంతృప్తిపడుతూ సుఖంగా కాలక్షేపంచేశాడు.






## 4

[కుండలినీ సైనికులకు తనకోట వశమైపోగానే, మందరదేవుడు నలుగురు సైనికులను వెంటతీసుకొని పడవలలో సముద్రంమీద బయలుదేరాడు. పడవలలో వస్తున్న మరి కొందరితో సముద్రంమీద యుద్ధం జరిగింది. ఆ పడవలలో ఉన్నది శివదత్తుడు! అతణ్ణి మందరదేవుడు కుండలినీరాజ్య పరిస్థితులనుగురించి అడిగాడు. తరవాత—]

మందరదేవుడికి, శివదత్తుడి మాటలు చాలా ఆశ్చర్యం కలిగించినై. ఎంతో అనుభవజ్ఞుడూ, ధైర్యశాలీ అయిన సమరసేనుడుకూడా, రాజ్యపాలనా వ్యవహారాల్లో ఎలా పొరబాట్లు చేశాడో అతడికి అర్థం కాలేదు. కానని ద్వీపాల్లో, అనేక సాహస కృత్యాలుచేసి తెచ్చిన సంపద, కుండలినీ ద్వీప వాసులకు మేలుచేయకపోగా కీడు కలిగించిందని అతడికి తోచింది.

"శివదత్తా! సమరసేనుడు, మంత్రాల దీవినుంచి తెచ్చిన ధనరాసుల ఓడ మీకు సర్వసౌఖ్యాలూ సమకూర్చిందని నేను భావించాను?" అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు బిగ్గరగా నవ్వి, "మందరదేవా! ఆ ధనరాసులే కుండలినీద్వీపంలో యింత అరాచకానికి కారణభూతమైనై. మేము ఆ నావతో కుండలినీద్వీపం చేరేసరికి రాజైన చిత్రసేనుడూ, ప్రజలూ మాకు ఘనస్వాగతం యిచ్చారు. వరసగా నెల రోజులపాటు రాజధానీ నగరం వేడుకలతో కళకళలాడింది. చిత్రసేనుడు ప్రజలమీద నామమాత్రంగా వున్న పన్నులుకూడా



రద్దుచేశాడు. రాజోద్యోగుల జీతాలు రెండింతలు మూడింతలుగా పెంచాడు!" అన్నాడు.

"అయితే, రాజ్యంలోని ప్రతి ఒక్కరూ సర్వసుఖాలు అనుభవించారనుకుంటాను!" అన్నాడు మందరదేవుడు.

"మందరదేవా! సావధానంగా వినండి, చెబుతాను!" అంటూ శివదత్తుడు ప్రారంభించాడు. "ఎప్పుడైతే ధనాగారం వెండి బంగారాలతో నిండిపోయిందో, అప్పుడే రాజైన చిత్రసేనుడికి రాజ్యపాలనా విషయాల్లో శ్రద్ధ తగ్గింది. 'కావలసినంత ధనం తెచ్చాను, ఇక దేశప్రజలకు లోటేమిటుంటుంది,' అనుకున్నాడు సమరసేనుడు.



చిత్రసేన మహారాజు, రాజోద్యోగులకు జీతాలు రెండు మూడు రెట్లు పెంచాడని చెప్పానుగదా? ఆ డబ్బుతో వాళ్లు విలాసాల్లో మునిగిపోసాగారు. ఇక పల్లెల్లోని వ్యవసాయదార్లుకూడా, కట్టవలసిన పన్ను చిల్లిగవ్వపాటికూడా లేకపోయేసరికి, వాళ్లకూ నడుంవంచి పంటలు పండించవలసిన అవసరం అంతగా కనబడలేదు. వాళ్లు కుటుంబ పోషణకు అవసరమైనన్ని తిండిగింజలు మాత్రం పండించుకుని, తతిమ్మా పొలాన్ని బీడుగా వుంచసాగారు. ఆహార పదార్థాలకొరత ఏర్పడింది.

ఈ కారణంవల్ల పట్టణాలకు రావలసిన ఆహారపదార్థాలు రావటం తగ్గింది. పట్టణప్రజలు గుంపులుగుంపులుగా గ్రామాలకు బయలుదేరి, ఆహార పదార్థాలను ఒకరికన్న మరొకరు పోటీపడి, ఎక్కువ వెలకు కొనసాగారు. ఆ విధంగా తమవద్ద చేరిన డబ్బుతో ఏంకొనాలో తెలియని వ్యవసాయదారులు, వడ్లధరలూ, కూరగాయల ధరలూ మరికొంత పెంచారు.

క్రమక్రమంగా రాజ్యం అరాజకంపాలు కాసాగింది. పెద్దపెద్ద మొత్తాలు చెల్లించి ఆహారధాన్యాలు కొనుక్కోలేని పట్టణవాసులు, ముఠాలుగా బయలుదేరి, రాత్రి



వేళల్లో గ్రామాలమీద పడి దోచుకోసాగారు. దీనికి ప్రతిగా గ్రామాల్లోవుండే ప్రజలు బస్తా వడ్లగింజల విలువ దాని ఎత్తు బంగారం అని నిర్ణయంచేశారు. వాళ్ళూ ముఠాలుగా తయారై, చేతికిదొరికిన అయుధాలతో ఆత్మరక్షణకు సర్వసన్నద్ధమయారు.

విలాస కాలక్షేపాల్లో మునిగిపోయిన చిత్రసేన మహారాజుకు యివేమీ తెలియవు. నిజం చెప్పాలంటే; ఆయనతోపాటు, నేనూ, సమరసేనుడుకూడా అదే పొరపాటుచేశాం. కారణం, దేశంలో ఏమూల ఏం జరుగుతున్నదో మాకూ తెలియదు. ధనాగారాన్నుంచి, ధనం మంచినీళ్ళప్రాయంగా ప్రజలమీదికి ప్రవహిస్తున్నా దాని అవసరం కలిగినవాళ్ళు చాలామంది వుండేవాళ్ళు. ఆహార పదార్థాల ధరలు లోగడకన్న వెయ్యిరెట్లు రెండువేల రెట్లు పెరగడంతో ఎవరికీ ఎంత ధనమున్నా చాలేదికాదు.

ఇక, చిత్రసేనమహారాజు కాలక్షేపం కోసం ప్రతిరోజూ ఏర్పాటుచేయించే వినోద ప్రదర్శనాల్లో వుండే వినోదం చాల చిత్రమైంది! ఇప్పుడాలోచిస్తే అవి వినోదప్రదర్శనాలు అనేందుకు చాలా సిగ్గుపడుతున్నాను. కాని అప్పట్లో వాటిని చూచేందుకు పౌరులు వందల వేల సంఖ్యలో వచ్చేవాళ్లు. ఇక ప్రదర్శనాల సంగతి :







అప్పుడే అడవినుంచి పట్టుకు వచ్చిన ఒక క్రూరమైన సింహాన్ని కటకటాలమధ్య వదిలేవారు. దానిని ఎవరైనాసరే ఖడ్గమాత్ర సహాయంతో సంహరించగలిగితే, అలాంటి వారికి, చచ్చిన సింహం బరువు బంగారం బహూకరింపబడేది. ధనకాంక్షతో చాలా మంది సాహసయువకులు సింహంతో పోరాడేందుకు వచ్చేవారు. దురదృష్టవంతులు సింహానికి బలి అయ్యేవారు, అదృష్టవంతులు దానిని చంపి, అంత ఎత్తు బంగారమూ గెలుచుకునేవాళ్లు.

రాను రాను యీ వినోదాలు అతి క్రూరంగా, అనాగరికంగా తయారైనై. ఏనుగుల పోరాటాలూ, ఏనుగుకూ, సింహానికీ మధ్య పోరాటం ... వినోద ప్రదర్శనలు యీవిధంగా వుండేవి. నేను, సమరసేనుడితో యిందులో వున్న క్రౌర్యాన్నిగురించి చెప్పిచూశాను. కాని, ఆయనకు నా మాట మీదకన్న, లోగడ మంత్రాలదీవిలో తనతో పాటు వున్న నరవాహనమిశ్రుడనే సైనికుడి మాటమీద ఎక్కువ గురి.

"ధనాగారంలో ధనానికేం కొదవలేదు. రాజు వృద్ధుడు. మనదేశ ప్రజలను ధైర్యవంతులుగా, సాహసవంతులుగా చేయవలసిన బాధ్యతకూడా వుంది. అలాంటప్పుడు రాజు వినోదంకోసం యిలాంటి ప్రదర్శనాలు ఏర్పాటు చేయటంలో వున్న తప్పేమిటి?" అనేవాడు సమరసేనుడు.

రాజూ, రాజోద్యోగులూ యిలాంటి విలాసాల్లో మునిగివుండగా, గ్రామప్రాంతాల్లో చాలా విచిత్రమైన మార్పులు రాసాగినై. అక్కడ కాస్త బలవంతుడూ, నోరుగలవాడూ అయిన ప్రతివ్యక్తీ, ఒక చిన్న రాజై కూర్చున్నాడు. కొందరు అనుచరుల్ని సంపాయించటం, పక్క గ్రామంమీద దాడి చేసి, వాళ్లను లోబరుచుకోవటం—ఇదీ పరిస్థితి. ఈ విధంగా ఒకే రాజ్యంలో, చిన్న చిన్న రాజ్యభాగాలు ఏర్పడినై. ప్రజలతో






పూర్తిగా సంబంధాలు కోల్పోయిన, చిత్రసేనుడికీ, అతడి వుద్యోగులకూ యివేమీ తెలియవు. కొంతగా కొంత యీ దుఃష్టపరిణామాలు తెలుసుకున్న నామాట అప్పట్లో ఎవరికీ రుచించలేదు.

దేశంలో వర్తకవ్యాపారాలూ, వ్యవసాయం సమూలంగా నాశనమైనై. అన్నిటికీ తెగించిన కొందరు, బందిపోటు ముఠాలుగా తయారై పట్టణాలనూ, పల్లెలనూ దోచుకోసాగారు. కాలక్రమాన చిత్రసేనుడి పరిపాలన రాజప్రాసాదానికి పరిమితమైపోయింది. దేశంలో ఆతణ్ణి తలచేవాడే లేడు. పుట్టగొడుగుల్లా దేశంలో ఎక్కడ



చూచినా రాజులూ, మహారాజులూ, సామ్రాట్టులూ బయలుదేరారు.

ఒకనాటి సాయంకాలం వినోదప్రదర్శనాలు తిలకిస్తున్న చిత్రసేనమహారాజుకు, ఒక దూతవచ్చి పత్రం ఒకటి చేతికిచ్చాడు. రాజు అది ఏమిటో చూడమని, పక్కన వున్న సమరసేనుడికి యిచ్చాడు. సమరసేనుడు అది చదువుతూనే వెలవెలపోయాడు. అతడి మొహాన కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు.

"మహారాజా, మీరు యిప్పటికి యీ ప్రదర్శనాలు సరిపెట్టి రాజభవనానికి రాకోరుతున్నాను. రాజ్యాంగవిషయం, మీతో మాట్లాడాలి, అవసరం!" అన్నాడు సమరసేనుడు. చిత్రసేనుడు అయిష్టంగా నాకేసీ, సమరసేనుడికేసీ చూసి అక్కడినుంచి బయలుదేరాడు. నేను శెలవు తీసుకొని వెళ్ళిపోయేటంతలో, సమరసేనుడు నన్నాపి, "శివదత్తా! చాలా ముఖ్యవిషయం. నీవుకూడా రావాలి!" అన్నాడు. ముగ్గురం రహస్య మందిరానికి వెళ్ళాం. సమరసేనుడు, దూత తెచ్చిన పత్రం మాకు చూపుతూ ఇలా చెప్పాడు:

"ఇంతకాలంనుంచీ మనం కళ్ళువుండీ లేనివాళ్ళం అయాం! ఈ కుండలినీ





ద్వీపంలో మనకు తెలియకుండానే కొందరు రాజులూ, మహారాజులూ మొలకలెత్తారు. వాళ్ళల్లో కొందరు మనకీ సందేశం పంపారు. దుష్టుడూ, అసమర్థుడూ అయిన రాజును తొలగించ దలిచారట! కోట తమవశంచేసి, లొంగిపొమ్మని వీళ్ళ అంత్య సందేశం."

అప్పటిగ్గాని చిత్రసేన మహారాజుకు ఇంతకాలంనుంచి పట్టిన మత్తు వదిలింది కాదు. ఆయన నిద్రలోనుంచి హఠాత్తుగా లేచినవాడులా, సమరసేనుడికేసి కళ్లు పెద్దవిచేసి చూశాడు. ఆ వెంటనే కాళ్లతో నేలను గట్టిగా తన్ని, "సమరసేనా! రాజ్య పరిస్థితులు కొంత చేజారినట్టే తోస్తున్నది ఈ పొగరుబోతుల పీచ మణచక తప్పదు. తతిమ్మా వాళ్ళకు కూడా గుణపాఠంగా వుండేట్టుగా, ఆ ముఖ్యనాయకులను పట్టి చిత్రవధ చేయించవలసింది," అన్నాడు.

"సరే, మహారాజా, శెలవు! మళ్లీ కలుసుకుంటాను," అని సమరసేనుడు గదినుండి బయటికి వచ్చేశాడు. నేను ఏమీ మాట్లాడకుండా అయన్ని అనుసరించి కొంతదూరం నడిచాను. హఠాత్తుగా సమరసేనుడు ఒక చోట ఠక్కున ఆగి:

"శివదత్తా! దీన్నిగురించి నీ అభిప్రాయమేమిటి?" అన్నాడు. అలా సమరసేనుడు



హఠాత్తుగా ప్రశ్నించేసరికి నేను గతుక్కుమన్నాను. దేశం అరాజక స్థితిలో వున్నదనీ, నోరుగలవాళ్ళు కొందరు ప్రజలను కూడ గట్టుకుని, వాళ్ళల్లో వాళ్ళు పోరాడుతున్నారనీ తప్ప, నాకు మరేం తెలియదు. చివరకు మహారాజునే ఎదిరించేంత బలశాలులు బయలుదేరారనేసరికి నాకు ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది. కాని, ఒకటి; సమరసేనుడికి దేశపరిస్థితుల్ని గురించి నాకు తెలిసినపాటి కూడా తెలియదని అసరికి గ్రహించాను!

"శత్రువులు బలశాలురనే నాకు తోస్తున్నది. అలా కానప్పుడు వాళ్ళు నగరంమీద





హఠాత్తుగా దాడిచేసివుండేవాళ్లు. ముందుగా హెచ్చరికచేసి, దాడికి రావటం అంటే.... మీరే ఆలోచించండి!'' అన్నాను.

సమరసేనుడు ఒకటిరెండు నిమిషాలు మాట్లాడలేదు. తరవాత తలపంకిస్తూ "శివదత్తా! నీవు చెప్పినదాంట్లో కొంత సత్యం లేకపోలేదు. అయినా మనకు సుశిక్షితమైన సైన్యంవుంది. అనుభవజ్ఞులూ, సమర్థులూ, నమ్మకస్తులూ అయిన నాయకులున్నారు. కనుక ఈ దేశద్రోహుల్ని కాలరాచటం ఎంతోసేపు పట్టదు!'' అన్నాడు.

సమరసేనుడు, 'నమ్మకస్తులైన నాయకులు,' అన్నది ఎవరినుద్దేశించో నాకు చూచాయగా తెలిసినట్టయింది. వాళ్ళు, తనతోపాటు మంత్రాలదీవిలో పడరానిపాట్లు పడిన కొద్దిమంది సైనికులూ, వాళ్లలో ముఖ్యుడైన నరవాహనమిశ్రుడూ.

"అయితే యీ ద్రోహుల్ని మట్టుపెట్టడం, ఎంత త్వరగా సాధిస్తే అంత మంచిది, సైన్యాన్ని సమాయత్తపరచండి. మీ నాయకత్వం ఎంతటి కష్టకార్యాన్నయినా సాధించగలదు,'' అన్నాను.

సమరసేనుడు నాకేసి ఆశ్చర్యపడుతూన్నట్టు చూసి "ఈ స్వల్ప కార్యానికి నువ్వుగాని, నేనుగాని స్వయంగా సైన్యనాయకత్వం వహించటం హాస్యాస్పదంగా వుంటుంది. నమ్మకస్తుడూ, ధైర్యశాలీ అయిన నరవాహనమిశ్రుడికి ఈ పని వప్పచెప్ప దలిచాను,'' అన్నాడు.

నరవాహనమిశ్రుణ్ణి గురించి అప్పటికే కొన్ని విషయాలు వినివున్నాను. అతడి ప్రవర్తన నాకు చాలాకాలంగా అనుమానకారణం అవుతున్నది. కానీ, ఆ సంగతి సమరసేనుడికి యిప్పటి పరిస్థితుల్లో చెప్పటం శ్రేయస్కరం కాదనిపించింది. అట్లని నాయకత్వం నరవాహనుడికి పోనీయటం ప్రమాదకరం! యిప్పుడు చేయవలసిందేమిటి? —(ఇంకావుంది)





# దైవాయత్తం

సౌనుమంతమనే దేశానికి మందపాలుడు రాజు. అయనకు లేకలేక ఒక కుమార్తె కలిగింది. ఆ పిల్లకు మాలతి అని పేరు పెట్టుకున్నారు. ఆ పిల్లకు జాతకర్మ జరిగే సమయంలో ఒక దూరదేశపు జ్యోతిష్కు డొకాయన అక్కడికి రావటం తటస్థించింది. ఆ జ్యోతిష్కుడు మాలతి జననకాలం తెలుసుకుని, చక్రంవేసి, తన భాషలో అమె జాతకం సమగ్రంగా రాసి యిచ్చి తనదారిన వెళ్ళిపోయాడు.

మాలతికి పదహారేళ్ళు నిండగానే తండ్రి పెళ్లి ప్రయత్నాలు ప్రారంభిస్తూ, ఆమె జాతకాన్ని చదివించటానికి ప్రయత్నిం చాడు. సమయానికి ఆ భాష సరిగా తెలి సిన వారెవరూ లేకపోయారు. తెలిసీ తెలి యని పండితు డొకాయన ఆ జాతకాన్ని చాలా కష్టపడి చదివి, "మహారాజా, ఇందులో అమ్మాయిగారికి రెండు పెళ్లిళ్లవు తాయని స్పష్టంగా రాసివుంది. మొగుడు పెళ్ళి అయిననాడే చచ్చిపోతాడని రాసి వుంది. ఈమె భర్త సామ్రాజ్యాధిపతి అని కూడా రాసివుంది. నాకంత బాగా తెలి యటంలేదు. బహుశా మొదటి భర్త చని పోగా, రెండోభర్త సార్వభౌముడవుతాడేమో సరిగా చెప్పలేను," అన్నాడు.

అప్పటికే మందపాలుడు మాలతిని ఇంద్రదత్తుడనే రాజకుమారుడి కిచ్చిచేయ నిశ్చయించాడు. అదృష్టం కలిసివస్తే ఇంద్ర దత్తుడు సార్వభౌముడు కావచ్చు. కాని పిల్ల జాతకంలో రెండు పెళ్ళిళ్ళు రాసి వుంది. అదీగాక ఒక భర్త పెళ్ళి కాగానే మరణిస్తాడనికూడా రాసివుంది. అందు చేత మందపాలుడు తన కుమార్తెకు, అసలు పెళ్ళికి పూర్వం ఇంకో పెళ్ళి చెయ్య నిశ్చయించి ఆ విషయం మంత్రు లతో ఆలోచనచేశాడు.

ఎస్. వేణుగోపాలరావు



ఆ సమయాన సానుమంత నగరానికి ఎక్కడినుంచో ముగ్గురు పిచ్చివాళ్ళు వచ్చి వున్నారు. ఒకడు "అంతా విచిత్రం," అంటాడు; ఇంకోడు, "దైవాయత్తం," అంటాడు; మూడోవాడు, "ఎవరికెవరూ లేరు," అంటాడు. ఈ పిచ్చివాళ్ళు ఈ మాటలుతప్ప ఇంకేమీ మాట్లాడరు. పగలు ఊరంతా ఇవే మాటలంటూ తిరుగుతారు. ఎవరన్నా భోజనం పెడితే తింటారు. పొద్దూకగానే ఈశ్వరీ ఆలయానికి పోయి మండపంలో పడుకుంటారు.

మంత్రులు మందపాలుడికి పిచ్చివాళ్ల వృత్తాంతం చెప్పి, "మహారాజా! ఇవాళ అర్ధ



రాత్రికి అమ్మాయిని పెళ్ళికూతుర్ని చేసి, పూజకు తీసుకుపోయినట్టుగా గుడికి తీసుకు పోయి, అమ్మవారి ఎదటనే ఆ పిచ్చివాళ్లలో ఒకడికి గుట్టు చప్పుడు కాకుండా పెళ్ళి చేయింతాం. రేపు మామూలు పెళ్ళి వుండనే ఉంది. ఈ పని చేస్తిమా, జాతకంలో చెప్పిన దోషాలు పరిహారమై శుభం చేకూర గలదు," అన్నారు. రాజు సమ్మతించాడు.

ఆ ప్రకారమే మాలతిని పెళ్లికూతురును చేసి నగరమంతా మాటుమణిగి ఉన్న సమయంలో ఆమెను ఈశ్వరీ ఆలయానికి తీసుకుపోయారు.

"మండపంలో పడుకుని ఉండే పిచ్చివాళ్ళలో ఎవరో ఒకర్ని లాక్కురండి. ఎవరైనా ఒకటే!" అన్నాడు మంత్రి భటులతో. ఎవరైనా ఒకటే అని మంత్రి అన్నప్పటికి, భటులు ఉన్న ముగ్గురిలో చిన్నవాణ్ణిగా చూసి తెచ్చారు. వాడు "దైవాయత్తం" అనేవాడు.

పురోహితుడు గబగబా నాలుగు మంత్రాలూ చదివి మాలతికీ, "దైవాయత్తం"కూ పెళ్లి చేసేశాడు. తరవాత మాలతిని తీసుకుని రాచవారు వెళ్ళిపోయారు. "దైవాయత్తం" వెళ్ళి మళ్ళీ మండపంలో పడుకున్నాడు.





మర్నాడే అసలు పెళ్లి. ఈ పెళ్లి మహా వైభవంగా, ఎంతో ఆర్భాటంగా జరిగింది. కాని మాలతికి ఇదే దొంగ పెళ్లిలాగా, కిందటి రాత్రి దొంగతనంగా జరిగినదే అసలు పెళ్లిలాగా తోచింది. ఆ రాత్రి రాజ భవనంలో సంబరానికీ, వినోదాలకూ, విందులకూ అంతే లేదు. విందు మధ్య నుంచి పెళ్ళికొడుకు, తన వంటో బాగా లేదని లేచిపోయాడు. తరవాత కొద్దిసేప టికే అతనికేదో తెరలాగా వచ్చింది. ఆ తెరలోనే అతనికి ప్రాణంపోయింది. ఒక్క సారిగా సంబరమంతా భీభత్సంగా మారింది. ఈ విపరీత పరిణామంచూసి మందపాలుడు నిర్ఘాంతపోయాడు. మంత్రి పెళ్ళికి వచ్చిన పండితులలో దక్షిణదేశవాసిని ఒకాయనను చాటుగా తీసుకుపోయి, మాలతి జాతకం చూపించాడు.

ఆ పండితుడు దానిని చదివి, "ఈ జాతకురాలికి రెండోభర్త పోతాడనీ, మొదటి భర్త చక్రవర్తి అవుతాడనీ ఇందులో ఉంది," అని చెప్పాడు.

మంత్రి కంగారు పడుతూ వెళ్ళి ఈ విషయం రాజుతో చెప్పాడు. "ఇక జాతకాలనుగురించీ జ్యోతిష్కులను గురించీ నాదగ్గిర చెప్పవద్దు. ఈ జోస్యులు జరిగినవన్నీ సరిగానే చెబుతారు. జరగబోయేవి





చెప్పమన్నప్పుడే పప్పులో కాలు వేసేది. ఆ పిచ్చివెధవ చక్రవర్తి కాబోతాడా ?" అన్నాడు రాజు కోపంగా.

ఎందుకైనా మంచిదని మంత్రి గుడి దగ్గిరికి మనుషులను పంపి పిచ్చివాళ్లున్నారేమో కనుక్కొరమ్మన్నాడు. వాళ్ళు తిరిగి వచ్చి అక్కడ ఎవరూ లేరని చెప్పారు. అంతఃపురంలో మాలతికూడా కనిపించ లేదు. ఆమె ఎప్పుడు వెళ్ళిందీ ఎటు వెళ్లిందీ చూసినవారు లేరు.

ఇంద్రదత్తుడు చచ్చినట్టు తెలియగానే మాలతికి పశ్చాత్తాపమూ, విరక్తి కలిగాయి. ఆమె తన చీనిచీనాంబరాలు విప్పేసి, కాషాయ బట్టలు ధరించి, ఆ భీభత్సంలో తప్పించుకుని, చీకట్లో పడి ఈశ్వరీ అలయానికి బయలుదేరింది. ఆ సమయానికే ముగ్గురు పిచ్చివాళ్ళూ ఆలయంలోనుంచి బయటికి వచ్చి ఎటోపడి పోసాగారు. మాలతి వారి వెనకనే పోసాగింది. వారు ముగ్గురిలో తన భర్త ఎవరో ఆమెకు తెలియదు.

పిచ్చివాళ్ళు అడవులవెంటా, దారుల వెంటా, అనేక గ్రామాలమీదుగా, చాలా రోజులు ప్రయాణంచేసి జయంతమనే పట్టణం చేరారు. మాలతి వారు నడిస్తే నడుస్తూ, వారాగితే ఆగుతూ, వారు తిండి సంపాదించిన చోటనే తానూ తింటూ వారిని వెంబడించింది.

జయంతనగరం చాలా కోలాహలంగా ఉంది. ఆ నగరానికి రాజు విజయవర్ధనుడు. ఆయనకు భూపాలదేవుడని ఒకే ఒక కొడుకుండేవాడనీ, అతను పెళ్లాడ నిరాకరించి, వైరాగ్యంతో ఎటో వెళ్ళిపోయాడనీ, అతను చచ్చిపోయినట్టు వార్త రాగా మహారాజు తన వారసుణ్ణి ఎన్నుకోవటం కోసం పట్టపు ఏనుగును వీధులలో అనాడే వదలబోతున్నాడనీ, జనం అనుకునే మాటలనుబట్టి మాలతి గ్రహించింది. వీధుల నిండా జనం కిక్కిరిసి ఉన్నారు.

ఎవరిమటుకు వారికి తమనే ఏనుగు వరిస్తుందని ఆశ! అది బయలుదేర బోతుందనగా రాజభటులు వీధులలో ఎవరినీ నడవనివ్వక పక్కగా నిలబెట్టారు. పిచ్చివాళ్ల వెంబడే మాలతికూడా నిలబడింది.

ఇంతలో జనంలో కలకలం బయలుదేరింది. ఏనుగు ఆ వీధిలోకే వస్తున్నది. అది దగ్గిరికి వస్తున్నకొద్దీ జనంలో కోలాహలం హెచ్చింది. ఏనుగు నేరుగా పిచ్చివాళ్ళున్నచోటుకు వచ్చి "దైవాయత్తం" ముందు ఆగి తొండం అతనివైపు చాచింది. జనమంతా స్తబ్ధులై కొయ్యబొమ్మల్లాగా నిలిచిపోయారు.

ఏనుగుమీదినుంచి ఆ దేశపు మంత్రి దిగివచ్చి, "దైవాయత్తం" కేసి పరీక్షగా చూసి, "మహారాజా! తమరేనా? ఏమదృష్టం! నేనుకూడా గుర్తించలేని స్థితిలో నోరులేని ఏనుగు తమర్ని గుర్తించిందా?" అంటూ ప్రణామంచేశాడు.

"దైవాయత్తం!" అంటూ ఆ పిచ్చివాడు విరగబడి నవ్వాడు.

నిజానికతను పిచ్చివాడు కాడు, ఆ దేశపు యువరాజు భూపాలదేవుడే. కొంత కాలంక్రితం అతనికీ మంత్రికీ ఘర్షణ జరిగింది. మంత్రి అతన్ని పెళ్లాడమన్నాడు. యువరాజు పెళ్లాడనన్నాడు.



"రాసి పెట్టివుంటే తప్పించుకోగలరా?" అన్నాడు మంత్రి.

"అంతా మానవాయత్తమే. దైవాయత్తం అంటూ ఏమీలేదు!" అన్నాడు యువరాజు.

ఒకనాడు జయంత నగరానికి యెవరో యోగి వచ్చాడు. ఆయన చాలా ప్రతిభా వంతుడుగా కనపడటంచేత మంత్రి ఆయ నను రాజభవనానికి తెచ్చాడు. యువ రాజుకూ యోగికీ చాలాసేపు వాగ్వాదం జరిగింది. తరవాత యోగి వెళ్ళిపోయాడు. ఆ మర్నాడే యువరాజు పిచ్చివాడులా అయిపోయి, "దైవాయత్తం" అంటూ దేశాలమీద బయలుదేరాడు. కొంతకాలానికి అతని జాడకూడా తెలియలేదు.

భూపాలదేవుడు "దైవాయత్తం" అంటూ దేశాలమీద తిరిగేసమయంలో అతనికి మరి ఇద్దరు పిచ్చివాళ్ళు తటస్థపడ్డారు. అందులో ఒకడు "అంతా విచిత్రం" అంటాడు. ఆయన ఒక మంచి బ్రాహ్మడు; తన భార్య దుష్ప్రవర్తనచూసి మతిచెడి దేశాలమీద బయలుదేరాడు. రెండోవాడు లక్షాధికారి అయిన వైశ్యుడు. తన బంధువులంతా తన చావుకోసం ఎదురుచూస్తూ, తన ధనం కోసం గోతికాడ నక్కల్లాగా కనిపెట్టుకుని ఉన్నారని తెలిసి, మతిపోయి, "ఎవరికీ ఎవరూలేరు," అంటూ దేశాలమీద బయలు దేరాడు. ఈ ముగ్గురూ కలిసే ఉన్నారు.

"మంత్రీ! నువ్వన్నట్టే అయింది! నా పెళ్ళికూడా దైవాయత్తంగానే జరిగింది. నా మాట నమ్మకపోతే మా వెంట యోగినిలాగా వస్తున్న ఈ పిల్ల నడుగు," అన్నాడు భూపాలదేవుడు.

అప్పుడు మాలతి తన భర్త "దైవాయత్త"మే నని తెలుసుకున్నది. మంత్రి ఆమెకు నమస్కారంచెసి యువరాజునూ, యువరాణిని ఏనుగుమీద ఎక్కించి రాజ భవనానికి తీసుకుపోయాడు. మాలతి చక్ర వర్తి భార్య కానే అయింది!



# మారిన తలలు

విక్రమార్కుడు చాలా పట్టుదల గలవాడు. బేతాళుడి ప్రశ్నకు సమాధానమివ్వటానికి తాను మౌనం విసర్జించటంవల్లనే బేతాళుడు శవంతోసహా చెట్టెక్కాడని ఆయన గ్రహించాడు. మళ్లీ వెనక్కు తిరిగి వెళ్ళి, చెట్టుమీదినుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని శ్మశానంకేసి నడవసాగాడు.

"రాజా, నీవు చాలా జ్ఞానివి. అందుచేత నిన్ను మరొక ధర్మసందేహం అడుగుతాను. ముందు ఈ కథ విను," అంటూ బేతాళుడీ విధంగా కథ చెప్పాడు:

శోభావతీనగరంలో కాళికాదేవి గుడి ఒకటి ఉన్నది. దాని ఎదటనే కాళీతీర్థం అనే పెద్ద కోనేరు కూడా ఉన్నది. ఏటా ఆషాఢ శుక్లచతుర్దశినాడు అక్కడ పెద్ద జాతర జరుగుతుంది. ఆ రోజు అనేక కోసుల దూరంనుంచి లక్షలాది జనులు

## బేతాళ కథలు



మదనసుందరి విషయమంతా ధవళుడు తండ్రికి చెప్పేశాడు.

"ఈ భాగ్యానికే నిద్రాహారాలు మానా లిట్రా, నాయనా? దాని తండ్రి నాకు స్నేహితుడే. ఇప్పుడే బయలుదేరిపోయి పెళ్లి ఖాయంచేసుకొస్తాను. నువు లేచి అన్నం తిను," అని తండ్రి చెప్పాడు.

అనుకున్నట్టే పెళ్ళి స్థిరమయింది. మంచి లగ్నంచూసి ధవళుడికీ మదన సుందరికీ పెళ్లిచేసేశారు. ధవళుడు భార్యను తన యింటికి తెచ్చుకుని సుఖంగా కాపరం చేస్తున్నాడు.

ఇంతలో ఒకనాడు ధవళుడి ఇంటికి వాడి బావమరిది వచ్చి, "బావా, మా యింట గౌరీవ్రతం చేసుకుంటున్నాం. నిన్నూ, చెల్లెల్నీ తీసుకుపోవటానికి వచ్చాను," అన్నాడు.

మర్నాడే ధవళుడు తన భార్యతోనూ, బావమరిదితోనూ అత్తవారింటికి బయలు దేరాడు. వారి దారి శోభావతీనగరంమీదు గానే ఉంది. వారు ముగ్గురూ కాళీ అలయందగ్గరకు చేరేసరికి ధవళుడికి అమ్మ వారి దర్శనం చేసుకోవాలనిపించింది. భార్యనూ, బావమరిదినీ రమ్మంటే, ఉత్త చేతులతో అమ్మవారిని చూడటం తమ

అక్కడికి వచ్చి, కోనేట్లో స్నానంచేసి, అమ్మవారి దర్శనం చేసుకుంటారు.

ఒక సంవత్సరం ఇలాగే బ్రహ్మస్థలమనే గ్రామంనుంచి ధవళుడనే చాకలి ఉత్స వానికి వచ్చాడు. కోనేటివద్ద స్నానానికి వచ్చినవారిలో మదనసుందరి అనే అంద మైన చాకలికన్యను చూశాడు. దాని ఊరూ, పేరూ, తండ్రిపేరూ విచారించాడు. ఆ మదనసుందరి తన భార్య అయితేనే తప్ప అన్నం ముట్టరాదని శపథంచేశాడు.

ఉత్సవానికి పోయి తిరిగి వచ్చినప్పటి నుంచీ ధవళుడు చిక్కిపోతూండటం గమ నించి వాడి తండ్రి కారణమడిగాడు.

కష్టంలేదన్నారు. ధవళుడు ఒక్కడే గుడి లోపలికి వెళ్ళాడు.

గుడిలో అమ్మవారిని చూడగానే ధవళుడికి ఒళ్ళు పరవశమైపోయింది. పద్దెనిమిది చేతులతో కాలికింద మహిషాసురుణ్ణి తొక్కిపట్టి కాళికాదేవి జేగీయమానంగా కనపడింది. అమ్మవారి విగ్రహానికి సమీపంలోనే వేటకత్తికూడా ఉంది.

"ఈ దేవికి అందరూ బలులిచ్చి పుణ్యం సంపాదిస్తారు. నన్ను నేనే బలియిచ్చుకుని ఏకంగా మోక్షం సంపాదిస్తాను," అనుకుని ధవళుడు, దేవిని ధ్యానించి వేటకత్తి తీసుకుని, ఒక్క వేటున తన తల తెగనరుకుకుని అక్కడే పడిపోయాడు.

భర్త ఎంతసేపటికి రాకపోవటం చూసి మదనసుందరి, చూసిరమ్మని తన అన్నను పంపింది. వాడు గర్భగుడిలోకి వచ్చి, తనను తానే అమ్మవారికి బలి ఇచ్చుకున్న తన బావమరిదిని చూశాడు. వాడికికూడా భక్త్యావేశం వచ్చి తన తల నరుక్కుని బావమరిది పక్కనే ఒరిగిపోయాడు.

వెళ్ళిన మగవాళ్ళకోసం ఎంతోసేపు చూసి మదనసుందరి ఆందోళన పడి, తానే స్వయంగా గుడిలోకి వచ్చింది. అక్కడ తన భర్తశవమూ, అన్నశవమూ



పడిఉండటం చూసి, దుఃఖంపట్టలేక ఏడుస్తూ, "తల్లీ, నా భర్తనూ, అన్ననూ ఒక్కసారే బలి పుచ్చుకున్నావా? ఇక నేనొక్కత్తెనూ బతికిఉండటం దేనికి? నీ ఎదటనే ఉరిపోసుకు చస్తాను," అని మదనసుందరి ఆత్మహత్యచేసుకోబోయింది.

ఆ సమయంలో దేవిముఖంనుంచి ఇలా మాటలు వినిపించాయి:

"వెర్రికూతురా! ఆత్మహత్య చేసుకోకు. నేను నీ భర్తనుగాని, అన్ననుగాని బలి కోరలేదు. వారే భక్తిపారవశ్యంలో తమ్ము తాము బలి ఇచ్చుకున్నారు. వారి మొండెములకు తలలు తగిలించు. వారిని ఇప్పుడే బతికిస్తాను."

అమ్మవారన్న ఈ మాటలు వినగానే మదనసుందరికి ఒళ్లుతెలియని ఆనందం కలిగింది. ఆమె ఆనందాశ్రువులు తుడుచుకొనైనా తుడుచుకోకుండా, ఆ గర్భగుడి చీకటిలో రెండు మొండెములకూ రెండు తలలూ చేర్చింది. మరుక్షణం ఇద్దరూ బతికారు. కాని ఒక్క పొరపాటు జరిగిపోయింది. మదనసుందరి తన భర్త మొండెముకు అన్నతలా, అన్న మొండెముకు భర్తతలా చేర్చి వారిని బతికించుకుంది.

ఈ కథ చెప్పి బేతాళుడు, "రాజా, నా సందేహమేమంటే మదనసుందరి బతికించుకున్న ఇద్దరిలో ఇప్పుడు భర్త ఎవరు? అన్న ఎవరు? ఇందుకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోతివా నీతల పగిలిపోతుంది. జాగ్రత్త!" అన్నాడు.

"ఇందులో సందేహానికి అవకాశమే లేదు. శరీరమంతటికీ తల ప్రధానం. అందుచేత భర్త తలగలవాడే భర్త, అన్న తలగలవాడు అన్న," అని సమాధానం చెప్పాడు, విక్రమార్కుడు.

రాజు మౌనం ఈ విధంగా భంగం కాగానే బేతాళుడు శవంతోసహా అంతర్ధానమై చెట్టెక్కి కూచున్నాడు.





# రాజ్యాన్వేషణ

మాళ్వదేశంలో ఒకప్పుడు సుదర్శనుడనే యువకుడుండేవాడు. వాడు చూపులకు నవ మన్మథుడే, కాని అతి బీదవాడు. వాడు చిన్నతనమంతా కాశీనగరంలో ఉండి చక్కగా చదువుకుని, చదువు పూర్తిఅయాక స్వదేశానికి బయలుదేరాడు.

అక్కడక్కడ మజిలీలు చేసుకుంటూ సుదర్శనుడు ఒకరాత్రికి పురందరమనే చిన్నరాజ్యం చేరాడు. నగరం ప్రవేశించే సరికి బాగా చీకటిపడింది. ఆ చీకటిలోపడి మరొకచోటికీ, మరొకచోటికీ వెళ్ళటం దేని కని, అతను నేరుగా రాజుగారి ఇంటికి వెళ్లి, "మహారాజా, నేను పరదేశిని, అభ్యాగతిని. ఈపూటకు భోజనమూ, శయనమూ చూపా రంటే రేపు ఉదయం నా తోవన నేను వెళ్ళి పోతాను," అన్నాడు.

పురందరరాజు అతని అందచందాలకూ, అతని ధైర్యానికీ ముచ్చటపడి సరేనన్నాడు. సుదర్శనుడు స్నానానికి వెళ్ళగానే రాణీ తన భర్తతో, "చూడండీ, ఈ కుర్రవాడు మామూలు దుస్తులు ధరించాడన్న మాటే గాని, నాకుచూడగా మారువేషంలో తిరుగు తూన్న ఏ చక్రవర్తి కుమారుడో అనిపిస్తోంది. అతని విషయం విచారించండి. అనుకూ లిస్తే అమ్మాయినిచ్చి చేద్దాం," అన్నది.

"మారు వేషంలో తిరుగుతున్నవాడు మనం అడిగితే నిజం చెబుతాడా? మంత్రి నడిగి ఏదో ఒకటిచేద్దాం!" అన్నాడు రాజు.

మంత్రి సంగతి సందర్భాలన్నీ తెలుసు కుని, "దానికేం భాగ్యం? కుర్రవాడు రాజవునో కాదో కనుక్కోవచ్చు. కాని ఒక్క రాత్రిలో తేలదు. అందుచేత అతన్ని కనీసం రెండురోజులైనా నిలిపిఉంచండి," అన్నాడు.

భోజనాల సమయంలో రాజు సుదర్శ నుడితో, 'అబ్బాయీ, నువు రేపు ఉదయమే వెళ్ళిపోతానని అన్నావు. అలా వెళ్ళటానికి

ఆర్. జగదాంబ




వీలులేదు. రేపు మా అమ్మాయి ఇందుమతి పుట్టినరోజు. రేపుకూడా ఇక్కడే ఉండిపో. ఎల్లుండి నీదారిన పోవచ్చు!" అన్నాడు.

ఈలోపుగా మంత్రి సుదర్శనుడికోసం ఒక గదిలో మామూలు పక్క ఒకటి వేయించాడు. ఆయన పహరావాణ్ణి ఒకణ్ణి పిలిచి, "ఒరే, నువు తెల్లవార్లూ ఈ గది బయటే కాపలా ఉండి, మన అతిథి సుఖంగా నిద్రపోతాడో లేదో గమనిస్తూ ఉండు!" అని హెచ్చరించాడు.

సుదర్శనుడు భోజనంచేసి తన పడక గదికి వచ్చాడు. తలుపు గడియపెట్టి పడుకుందామని పక్కమీద కూచుని చొక్కా విప్పాడు. వెంటనే చొక్కాజేబులోనుంచి రెండు మూడు గుప్పిళ్ల పచ్చిశనగలు పక్కనిండా, గదినిండా పడ్డాయి!

జరిగిన సంగతేమిటంటే, సుదర్శనుడు వచ్చేటప్పుడు దారిపక్కన శనగచేలు తగిలాయి. అతను బీదవాడూ, జాగర్తగల వాడూ కావటంచేత, ఏపూటనైనా భోజనం దొరకని పక్షంలో తిందామని, శనగ కాయలు కోసి, ఒలిచి, పచ్చిశనగలు రెండు జేబులనిండా పోసుకున్నాడు, తరవాత వాటి విషయం పూర్తిగా మరిచాడు.

ఈ దిక్కుమాలిన శనగలు గది అంతా పడటంవల్ల సుదర్శనుడికి పెద్ద చిక్కు వచ్చింది. తాను చిన్నవాడైనా, రాజుగారు తనకు గొప్పగా ఆతిథ్యమిచ్చాడు. నౌకర్లు రేపు ఈ శనగలన్నీ చూసి రాజుగారితో చెబితే ఆయనకు తనమీద ఉన్న ఆదరమంతా పోతుంది. అందుచేత సుదర్శనుడు నిద్రకు వాయిదావేసి పక్కమీద పడిన శనగగింజలన్నీ జాగ్రత్తగా ఏరాడు. పక్క దుప్పటి తీసి దులిపాడు.

తరవాత గది అంతటా పడిన గింజలన్నీ ఏరాడు. ఒక్క గింజకూడా మిగల్చకుండా అన్నీ ఏరేసరికి అర్ధరాత్రి దాటిపోయింది. ఇంక ఈ శనగలను జేబులో ఉంచు

కోవటం ప్రమాదకరం. అందుచేత, ఆకలి లేకపోయినా, సుదర్శనుడు ఒక్కొక్క గింజే తినసాగాడు. అతను పడుకునేసరికి రాత్రి మూడు జాములయింది.

మర్నాడు ఉదయం మంత్రి పహరావాణ్ణి పిలిచి, "ఏంరా? రాత్రి చిన్నబాబుగారు సరిగా నిద్రపోయారా?" అని అడిగాడు.

"బాబూ! రాత్రి ఆయనకీ నిద్రలేదు, నాకూ నిద్రలేదు. తెల్లవార్లూ ఆయన గది అంతా తిరుగుతూనే ఉన్నారు. పక్క దుప్పటీ దులపటంకూడా నాకు వినిపించింది. మూడు జాములయాక నేను నిద్రపోయాను. ఆయన ఎప్పుడు పడుకున్నారో నాకు తెలీదు," అన్నాడు పహరావాడు.

మంత్రి వెంటనే రాజుదగ్గిరికి వెళ్ళి, "మహారాజా, మన అతిథి అతి సుకుమారుడు. నేను రాత్రి వేయించిన పక్కమీద మరొక సామాన్యుడైతే సుఖంగా నిద్రపోయేవాడే. ఇతను మహాభోగి! ఏ చక్రవర్తి కుమారుడో తప్ప మరొకడుకాడు!" అన్నాడు.

తెల్లవార్లూ శనగలు తిని ఉబ్బరంచేసి ఉన్న సుదర్శనుడు, మర్నాడు విందులో ఏ పదార్థమూ ఆసక్తితో ముట్టకపోవటం చూసి రాజుకూ, రాణికీ మంత్రిమాటలలో మరింత గురికుదిరింది. రెండోరాత్రి మంత్రి సుదర్శనుడికి చక్కని హంసతూలికా







మంత్రి ఇందుమతిని వెంటపెట్టుకుపోయి సుదర్శనుడితో పెళ్లిప్రస్తావన చేశాడు. మొదట తెల్లబోయి తరవాత సుదర్శనుడు పెళ్ళికి ఒప్పుకున్నాడు. రాజూ రాణీ పొందిన ఆనందానికి మేర లేదు. దగ్గిరలో ఉన్న శుభముహూర్తాన బీదబ్రహ్మచారి సుదర్శనుడికీ, రాజకుమార్తె ఇందుమతికి వివాహం జరిగింది.

ఒక ఏడాదిపాటు సుదర్శనుడు సమస్త సుఖాలూ అనుభవించాడు. తరవాత అతని కష్టాలు ప్రారంభమయాయి.

ఒకరోజు ఇందుమతి తన భర్తతో, "ఏమండీ? ఇట్లా ఎంతకాలం మనం ఇక్కడ కూచుంటాం? మన రాజ్యానికి మనం పోదాం పదండి!" అన్నది.

సుదర్శనుడు నిర్ఘాంతపోయి, "మన రాజ్యమా?" అన్నాడు.

"అవును. మీరు మహారాజులని నాకు పెళ్లి కాకపూర్వమే తెలుసులెండి! ఎంత కాలం ఆడతారీ నాటకం?" అంటూ ఇందుమతి, మంత్రి పెట్టిన పరీక్షలు వివరించి చెప్పింది. అదంతా వింటుంటే సుదర్శనుడికి మతిపోయినట్టయింది.

కాని తనభార్య కిప్పుడొక రాజ్యంచూపక తప్పదు. ఆమెతో నిజం చెప్పెయ్యవచ్చు;

తల్పం వేయించాడు. ఒక రాత్రల్లా నిద్ర లేని కారణంచేత, సుదర్శనుడు చాలా బడలి ఉండి హంసతూలికాతల్పం మీద నడుము వాలుస్తూనే గాఢనిద్రలో మునిగి పోయాడు.

మంత్రి, రాజదంపతులతో, "ఇక ఎటువంటి సందేహమూ వద్దు. నా భయమల్లా, ఇంత గొప్పవాడు అమ్మాయిని చేసుకోనంటాడేమోనని!" అన్నాడు.

"మామూలు మనిషిగా నటిస్తున్నవాడు అమ్మాయిని ఏ కారణంచేత చేసుకోనంటాడూ? మీరు సంశయించక అతన్ని అడిగిచూడండి!" అన్నది రాణి.





కాని ఆమె నొచ్చుకుంటుందని అతను భయ పడ్డాడు. భార్యను ఏమాత్రం బాధపెట్టటం అతనికి ఇష్టంలేదు.

'ఆమెతో బయలుదేరి దేశాటన చేస్తాను. కాలక్రమాన నిజం ఆమే తెలుసుకుం టుంది!' అనుకుని సుదర్శనుడు, అత్త మామలకు చెప్పి, ఒక శుభముహూర్తాన భార్యతో బయలుదేరాడు.

వారాలూ, నెలలూ గడిచాయి. ఒక ఊరు నుంచి మరొక ఊరికీ, ఒక దేశంనుంచి మరొక దేశానికీ దంపతులు ప్రయాణం చేస్తున్నారు. భర్త తనను తన దేశానికి తీసుకుపోతున్నాడన్న దృఢనమ్మకం తప్ప ఇందుమతికి మరేమీ తెలియదు. ఆమె అతనితోపాటు నడిచింది, చెట్లకింద పడు కున్నది, అష్టకష్టాలూ పడింది; కాని ఒక్క సారికూడా తనభర్తను, "మనం ఎటు పోతున్నాం? ఎక్కడికి పోతున్నాం?" అని అడిగిన పాపాన పోలేదు.

ఎన్నోసార్లు సుదర్శనుడు తనభార్యను ఏమార్చిఒంటరిగా వెళ్లిపోదామనుకున్నాడు. కాని తనయందు అంత మూఢవిశ్వాసం ఉంచి, తనతో సమానంగా కష్టాలుపడే భార్యను విడిచిపోవటానికి అతనికి మనస్సు రాలేదు. రాజాంతఃపురంలో ఉన్నప్పటికన్న



ఇందుమతి ఇప్పుడతనికి చాలారెట్లు ప్రియ తమురాలయింది.

ఇల్లు బయలుదేరిన ఆరుమాసాలకు భార్యాభర్తలు కళింగనగరంచేరారు. వర్త కులవద్ద ఇందుమతి నగలు కొన్ని విక్ర యించి పేదరాసి పెద్దమ్మ ఇంట బసచేశారు.

ఈ ఇద్దరినీ చూడగానే పేదరాసి పెద్ద మ్మకు అనుమానం కలిగింది. ఇందుమతి రాజకుమార్తె అన్నది కనిపిస్తూనే ఉన్నది. కాని పెద్దమ్మకళ్ళు సుదర్శనుడిమీదనే ఉన్నాయి. ఏమంటే, పదిహేనేళ్ళక్రితం కళింగరాజు కుమారుణ్ణి దొంగలు ఎత్తుకు పోయారు. ఆ కుర్రవాడు జీవించిఉంటే

సుదర్శనుడి ఈడే ఉండేవాడు. ఇతనే అత నేమోనని పేదరాసిపెద్దమ్మకు తోచింది.

ఆమె ఇందుమతిని చాటుకు పిలిచి, "అమ్మా, మీరెవరు? నీభర్తకు ఏంపని?" అని అడిగింది.

"నేను పురందర రాజకుమార్తెను. నా పేరు ఇందుమతి. నా భర్త ప్రచ్ఛన్నంగా తిరుగుతూన్న రాజకుమారుడు," అన్నది ఇందుమతి.

"నీ భర్త ఏ దేశపు రాజకుమారుడు?" అని అడిగింది పేదరాసిపెద్దమ్మ, ఆత్రంగా.

"అది నాకూ తెలియదు. నేను నా భర్తను అడగలేదు. మేము చాలా రోజులుగా ప్రయాణంచేస్తున్నాం," అన్నది ఇందుమతి.

పెద్దమ్మ అనుమానం దృఢపడింది. ఆమె దివాణానికి వెళ్ళి కళింగరాజుతో, "మహాప్రభూ, మా ఇంటికి ఒక కుర్ర వాడు భార్యతో సహా వచ్చాడు. చిన్న తనంలో దొంగలు ఎత్తుకుపోయిన మీ కుమారుడేనని నాకు అనుమానంగా ఉంది," అని చెప్పింది.

"ఆ భార్యాభర్తలను ఒకసారి ఇక్కడికి తీసుకురా," అన్నాడు రాజు.

ఆ సాయంకాలమే పేదరాసిపెద్దమ్మ సుదర్శనుణ్ణీ, ఇందుమతినీ రాజాంతః పురానికి తీసుకుపోయింది. సుదర్శనుణ్ణి చూడగానే కళింగరాజూ, ఆయన భార్యా చాలా ముచ్చటపడ్డారు. అతనిలో రాజుకు రాణిపోలికలూ, రాణికి రాజుపోలికలూ కనిపించాయి.

"నాయనా, నువు మా కొడుకువే! మాదగ్గిరే ఉండిపో!" అన్నాడు కళింగ రాజు. సుదర్శనుడు ఒప్పుకున్నాడు.

సుదర్శనుడికి యువరాజ్యాభిషేకం చేశారు. పురందరదేశానికి శుభవార్త చేర గానే, అక్కడి మంత్రి, "నేనప్పుడే చెప్ప లేదా? మనకు కళింగయువరాజు అల్లుడు కావటం ఎంత అదృష్టం!" అన్నాడు.






రాజులసేవ కత్తిమీది సామువంటిది. కాళిదాసును ప్రాణంతోసమానంగా చూసుకునే భోజరాజుకుకూడా కాళిదాసుపై ఏదో ఆగ్రహం కలిగింది. ఆ కారణంగా కాళిదాసు ధారానగరం విడిచి పోయాడు.

కాళిదాసు వెళ్ళిపోయిన అనంతరం భోజరాజు పండిత పరిషత్తులో ఒక రకమైన అరాజకం ఏర్పడింది. ఆ పండితులలో ముగ్గురు చురుకైనవాళ్ళు చేరారు. వారిలో ఒకడు ఏకసంథాగ్రాహి—అంటే, ఏదైనా ఒకసారి వింటే పట్టెయ్యగలవాడు; రెండోవాడు ద్విసంథాగ్రాహి—రెండుసార్లు విని పట్టేస్తాడు; మూడోవాడు త్రిసంథాగ్రాహి.

ఎవరైనా ఊరూపేరూ లేని కవులు ఒక కొత్త శ్లోకం చదివితే భోజరాజు వారికి ఒక లక్ష పారితోషికం ఇచ్చి పంపుతూండేవాడు. కాని ఈ ముగ్గురూ చేరినాక ఈ అచారానికి విఘాతం కలిగింది. ఎందుకంటే ఎవరైనా వచ్చి సభలో శ్లోకం చదివితే ఏకసంథాగ్రాహి లేచి, "ఇది నేను విన్న శ్లోకమే," అని తానుకూడా దానిని చదివేసేవాడు. అప్పటికి రెండుసార్లు విని ఉన్న ద్విసంథాగ్రాహి, "పాత శ్లోకమే," అని తానుకూడా చదివేవాడు. అతని వెనకగా త్రి సంథాగ్రాహి చదివేవాడు. అది పాత శ్లోకమేనని భోజరాజుకు నమ్మకం కుదిరేది. కొత్తగా వచ్చినవాడు అవమానంపొంది వెళ్లిపోయేవాడు.

ఈ విధంగా అనేకమంది పండితులు భోజరాజు దగ్గిర శ్లోకాలు చదివి, బహుమానానికి బదులు పరాభవంపొంది, తిరిగి వెళ్ళిపోయూరు. ఇలా వెళ్ళిపోయినవారిలో ఒకడు దూరదేశంలో ఉన్న కాళిదాసుకు తటస్థపడ్డాడు.

పండితుడి అనుభవమంతా విని కాళిదాసు చాలా చింతించాడు. తాను వచ్చినాక భోజరాజు ఆస్థానం ఎలా మారిపోయిందీ

ఎమ్. రామానుజాచారి

కాళిదాసుకు అర్థమయింది. భోజరాజుకూ, అతని పండితులకూ తగిన శాస్తి చేద్దామని కాళిదాసు నిశ్చయించుకుని, ఒక శ్లోకం రచించి, పండితుడికిచ్చాడు. "ఈ శ్లోకం తీసుకుపోయి భోజరాజు ఆస్థానంలో చదవండి. మీకు పారితోషికం తప్పక లభిస్తుంది," అన్నాడు.

పండితుడు ఆ శ్లోకం తీసుకుని ధారానగరంచేరి భోజరాజు ఆస్థానానికి వెళ్ళాడు.

"మహారాజా, కొత్త శ్లోకం రచించాను. విని, తగిన పారితోషికం ఇప్పించండి!" అన్నాడు పండితుడు. భోజరాజు శ్లోకం చదవమన్నాడు. పండితుడీశ్లోకం చదివాడు:

"స్వస్తి, శ్రీ భోజరాజ ! త్రిభువనవిదితో
ధార్మికస్తే పితా భూ
త్పిత్రాతే వై గృహీతా నవనవతిమితా
రత్నకోట్యోమదీయాః,
తా మేదేహీతి, రాజన్ ! సకల బుధజనై
ర్జాయతే సత్యమేత
న్నోవా జానంతితే తన్మమకృతి మధవా
దేహిలక్షంతతోమే."

["శ్రీ భోజరాజుకు స్వస్తి ! ధార్మికుడని మూడులోకాల ప్రసిద్ధిగాంచిన మీతండ్రిగారు 99 కోట్ల రత్నాలు నావి తీసుకున్నాడు. వాటిని నాకు ఇప్పించు. ఈ మాట నిజమని పండితులందరూ ఎరుగు



దురు. ఒకవేళ వారు ఎరగనిపక్షంలో నా యీ శ్లోకానికి అధమం లక్ష అయినా ఇయ్యి."]

ఈ శ్లోకం వినగానే ఏకసంథాగ్రాహి మొదలైనవాళ్ళు పెద్ద చిక్కులో పడ్డారు. ఈశ్లోకం అదివరకే తమకు తెలుసునన్నట్టయితే, భోజరాజు తండ్రి ఈపండితుడివద్ద 99 కోట్ల రత్నాలు తీసుకుని ఉన్నమాట తమకు అదివరకే తెలిసినట్టు సాక్ష్యం చెప్పినవారవుతారు. ఆమాట సమస్త పండితులకూ తెలుసునని శ్లోకంలో ఉన్నది. శ్లోకం తెలియనివారికి మాత్రమే ఆ మణుల మాట తెలియకపోవాలి. తమకా శ్లోకం తెలియదన్నపక్షంలో అది సరికొత్తశ్లోకమవుతుంది. భోజరాజు పండితుడికి ఒక లక్ష మాత్రమే ఇవ్వవలిసి వస్తుంది.

అందుచేత సభలో అందరూ అది కొత్త శ్లోకమేనని ఒప్పుకున్నారు. భోజరాజు పండితుడికి లక్ష పారితోషికం ఇప్పించి, "అయ్యా, మీరు ఈ శ్లోకం ఈ విధంగా ఎందుకు రాయవలిసి వచ్చింది? దీని అంతర్యమేమిటి?" అని అడిగాడు.

పండితుడు భోజరాజుతో, తాను పూర్వం వచ్చి ఒక కొత్తశ్లోకం చదివినసంగతీ, సభలోని కొందరు పండితులు అది పాతశ్లోకమని రుజువుచేసిన సంగతీ, తన కథ అంతా విని ఎవరో బ్రాహ్మడు ఈశ్లోకం రాసి పంపిన సంగతీ చెప్పేశాడు.

ఏకసంథాగ్రాహి, ద్విసంథాగ్రాహి, త్రిసంథాగ్రాహి కలిసి ఆడే నాటకం భోజరాజుకు అర్థమయింది. వీరిమూలంగా ఎందరికి అన్యాయం జరిగిందో?

ఈ శ్లోకం రాసి పంపినది కాళిదాసేనని భోజరాజుకు అనుమానం తగిలింది. ఆయన సపరివారంగా బయలుదేరి ఆ పండితుడి వెంట వెళ్ళి కాళిదాసును కలుసుకుని, క్షమాపణ చెప్పుకుని, ధారానగరానికి తిరిగి తెచ్చుకున్నాడు.





# సుకుమారి

ఒక ఊళ్ళో ఒక ధనికుడికి సుకుమారి అనే కుమార్తె ఉండేది. ఆ పిల్ల తగని సోమరిపోతు, పనికిమొండి, అస్తమానం పిల్లులతో ఆడుకుంటూండేది. ఆమెకు యుక్తవయసు రాగానే తండ్రి ఆమెకోసం సంబంధాలు వెతికాడు. సుకుమారి చాలా మందిని నిరాకరించి ఒక అందగాడైన బీద పిల్లవాణ్ణి చేసుకోవటానికి ఒప్పుకున్నది. అయితే పెళ్లికి ముందు ఆమె ఆ యువకుడిచేత ఒక ప్రతిజ్ఞ చేయించింది. అదేమిటంటే, అతను సుకుమారిని పొరపాటున కూడా కొట్టరాదు, తిట్టరాదు

కాపరానికివచ్చినా సుకుమారిలో కొంచెం కూడా మార్పులేదు. భర్త ఇంటకూడా ఆమె ఇక్కడివస్తువు అక్కడపెట్టి ఎరుగదు. అస్తమానం తన పెంపుడు పిల్లితో ఆడుకునేది. ఆ పిల్లే ఆమెకు పంచప్రాణాలూ. సుకుమారి భర్తకు ఏమిచెయ్యాలో తోచలేదు. ఇల్లు చూడబోతే ఎక్కడి పాచి అక్కడే ఉండేది. ఏనాడూ వేళకు వంట అయేది కాదు. ఎందుకు చెయ్యాలేదని అడిగితే అలక్ష్యంగా జవాబు చెప్పేది.

కొద్దికాలంలోనే మొగుడిప్రాణం విసిగిపోయింది. అతను, ఎన్నోసార్లు సుకుమారిని మెత్తగా తన్నబుద్ధి అయికూడా, తన కోపాన్ని అణుచుకున్నాడు.

చివరకు అతను భార్యకు బుద్ధిచెప్పటానికి ఒక ఉపాయం ఆలోచించాడు. ఒక రోజు ఉదయం బయటికి పోతూ, సుకుమారి పక్కనే ఆడుకుంటున్న పిల్లిని చూసి, "ఏంయ్, పిల్లీ! నేను మధ్యాన్నానికి తిరిగి వచ్చేసరికల్లా ఇల్లు శుభ్రంగా ఉంచు, వంట చేసి సిద్ధంగా పెట్టు, లేకపోతే నిన్ను తీవ్రంగా శిక్షిస్తాను!" అని బయటికి వెళ్ళిపోయాడు.

అతను మధ్యాన్నానికి తిరిగివచ్చేసరికి ఇంటి పరిస్థితిలో మార్పేమీ లేదు. ఎక్కడి

కె. వీరభద్రశాస్త్రి

పాచి అక్కడే ఉంది. పొయిలో నిప్పయినా లేదు. సుకుమారి పిల్లితో ఆడుకుంటున్నది.

ఆమెభర్త కోపంగా ఆమెచేతిలోనుంచి పిల్లిని లాగేశాడు. అది సుకుమారిని పట్టుకోబోవటంలో గోళ్ళువిప్పి ఆమె చేతులను గట్టిగా పీకింది.

సుకుమారి భర్త తాను చేయలేని పని పిల్లిచేత చేయించి, దానితో "నీకు ఉదయం ఏంచెప్పి వెళ్ళాను? నువుచేసినదేమిటి?" అంటూ దాన్ని గట్టిగా కొట్టసాగాడు.

పిల్లిపీకటంవల్ల రక్తంకారి బాధపడుతున్న సుకుమారి, పిల్లితినే దెబ్బలుచూడలేక, భర్తతో, "దాన్నెందుకు కొట్టడం? దానికి మన మాటలు అర్థమవుతాయా? పిల్లి ఎక్కడన్నా పాచిపనీ, వంటా చేస్తుందా?" అని అడిగింది.

భర్త కోపంగా పిల్లిని పారేస్తూ, "ఏమో, నాకదంతా తెలీదు. ఈ ఇంటో నాకు చెప్పి చెయించుకునే అధికారం ఈ పిల్లిమీద మాత్రమే ఉన్నది. నేనా అధికారాన్ని దానిమీద తప్పక చూపిస్తాను," అన్నాడు.

ఇంత అయినాకకూడా సుకుమారి మారలేదు. మర్నాడు మళ్ళీ ఆమె భర్త ఇంటికి వచ్చి, ఆమెచేతిలోనుంచి పిల్లిని లాగి, "ఇంకా నీకు బుద్ధిరాలేదా?" అని చచ్చేటట్టు కొట్టాడు. ఈసారికూడా పిల్లి ఆత్మరక్షణ చేసుకోబోయి ఆమెను పీకింది.

సుకుమారి నిర్ఘాంతపోయి, "అది కాస్తా నిష్కారణంగా చచ్చిపోతుంది. కొంచెమైనా ఫలితం ఉండదు," అన్నది.

"దానిమీద నీకంత జాలి ఉంటే, దాని ప్రాణం కాపాడుకోవటానికిగాను, దానికినేను చెప్పే పని నువ్వే చెయ్యి," అన్నాడు భర్త.

ఆరోజు అతను ఇంటికి వచ్చేసరికి ఇల్లు అద్దంలాగా ఉంది. వంట యావత్తూ సిద్ధంగా ఉంది. పిల్లిమీది మమకారంతో సుకుమారి మారిపోయింది. ఆమె మరెన్నడూ భర్తను అలక్ష్యంగా చూడలేదు.






ఒక ఊళ్లో ధనగుప్తుడనేవాడు అనేక పాపాలకు ఒడిగట్టి, ధనం సంపాదించి, కోటీశ్వరుడైనాడు. ఆయనను గురిగాపెట్టుకుని, ఆయన సహాయంతో అనేకమంది ఇతర వర్తకులు లక్షాధిపతులయారు.

ధనగుప్తుడికి ముసలితనం పైనపడింది. చావు దగ్గిరికి వస్తున్నకొద్దీ ఆయనకు పాపభీతి పట్టుకున్నది. బతికినన్నాళ్ళూ పాపాలే చేశాడు, ఇకనైనా కొంత పుణ్యం మూట కట్టుకోకపోతే, చచ్చినాక ఏ నరకకూపాలలో యాతన పడవలిసివస్తుందోనని ఆయన భయపడసాగాడు. పుణ్యం సంపాదించటానికిగాను తీర్థయాత్రలు చేసివద్దామనుకున్నాడు.

ధనగుప్తుడు తీర్థయాత్రలకు బయలుదేరుతున్నాడనేసరికి మరి ముగ్గురు వర్తకశ్రేష్ఠులు తాముకూడా ప్రయాణమయారు. వారుకూడా పుణ్యంచేసుకుని ఎరగరు.

ధనగుప్తుడు ఏదో పరమార్థం లేనిదే ఏపనీ చెయ్యడని వారికితెలుసు. పుణ్యం మాట అటుంచి, ఈ తీర్థయాత్రవల్ల ఇంకేవైనా లాభాలుండవచ్చు. ఆ లాభాలు తాముమాత్రం ఎందుకు పొందగూడదూ? అదీగాక, ఒకరికి నలుగురైతే ఖర్చు కలిసివస్తుంది. దారిలో ఎవరికైనా కాస్త జబ్బు చేసినా మిగిలినవాళ్ళు ఆదుకుంటారు. ఇవన్నీ ఆలోచించి ధనగుప్తుడు వారిని వెంటపెట్టుకు పోవటానికి ఒప్పుకున్నాడు.

కాశీవెళ్లటమా, రామేశ్వరం వెళ్ళటమా అని వారిలో వారికి చర్చ జరిగింది. కాశీకి పోవటమూ, కాటికి పోవటమూ ఒకటేనని సామెత. రామేశ్వరమైతే దగ్గిర. దారి సులువు. అదీగాక ఆ గ్రామంలోనే రాముడని ఒక అంటరానివాడున్నాడు. వాడు ఇంట్లో అలిగి మూడుసార్లు రామేశ్వరం పారిపోయి తిరిగి వచ్చాడు. వాడికి రామే

శింగంపల్లి అప్పారావు

శ్వర ప్రయాణం కొట్టినపిండి. వాణ్ణి వెంట పెట్టుకుని నలుగురు వర్తకులూ రామేశ్వరం పోవటానికి నిశ్చయించారు.

మంచిరోజు చూసుకుని, రాముడు ముందుదారితీయగా, రామనామ స్మరణ చేస్తూ నలుగురు వర్తకులూ రామేశ్వరం బయలుదేరారు. ప్రయాణం అన్నివిధాలా అనుకూలంగానే సాగింది. ఇంకా ఒకటి రెండు రోజుల ప్రయాణం మిగిలి ఉం డనగా కారుమేఘాలు ముంచుకువచ్చాయి. ప్రళయమైన గాలి వీచసాగింది.

ఆ సమయాన యాత్రికులు ఒక అడవి కుండా నడుస్తున్నారు. గాలికి ఎంతెంత మానులూ భయంకరంగా ఊగుతూ, విరిగి మీద పడేటట్టు కనపడ్డాయి. పైన మేఘాలు ఏనుగులమందలాగా తిరుగుతూ భీకరంగా గర్జిస్తున్నాయి. కళ్లు చెదిరే మెరుపులకు యాత్రికుల కళ్లు గుడ్డి అయిపోతున్నాయి.

వాళ్ళు పిక్కబలంకొద్దీ పరిగెత్తి, ఎట్లా గయితేనేం, ఒక పాడుపడిన చిన్న దేవళంలో తలదాచుకున్నారు. వెంటనే పిడుగుల వర్షం ప్రారంభమయింది. వారున్న చోటికి అతి సమీపంలోనే ఒకటి తరవాత ఒకటిగా పిడుగులు, బాంబుల్లాగా, భయంకరమైన శబ్దంతో పడసాగాయి. ఒక పిడుగు అంతదూరాన ఉన్న పెద్ద చెట్టు మీద



పడింది. చెట్టు సగం సురసురా కాలి పోయింది, మిగిలినది విరిగి పడిపోయింది. మరికొద్ది క్షణాలకు ఇంకొక పిడుగు దేవళానికి యాభై అంగల దూరాన పడింది. యాత్రికులకు ప్రాణాలలో ప్రాణాలులేవు.

"ఇదేం పిడుగులవర్షం! నా జన్మలో ఎన్నడూ ఇలాటిది ఎరగను! మనలో ఎవడో పాపాత్ముడున్నాడు. ఆ పాపాత్ముడి మూలంగా మనమందరమూ నాశనం అవుతాం. తప్పదు!" అన్నాడు ధనగుప్తుడు.

"ఈ రాముడే పాపాత్ముడు. ఈ అంటరానివాణ్ణి మనం తీసుకురావటమే తప్పు. తెచ్చామే అనుకో, వీడుకూడా మనతో సమంగా ఈ పవిత్రమైన దేవళంలో తగుదునమ్మా అని వచ్చికూచున్నాడు. దేవుడు చూడడూ? ఆగ్రహించడూ?" అన్నాడు మరొక యాత్రికుడు.

నలుగురూ కలిసి రాముణ్ణి అవతలికి వెళ్ళమన్నారు.

"బాబూ, పెద్దవాన అయింది. తడిసిపోతాను కరుణించండి. పుణ్యంకట్టుకొండి. నేను పాపినే. కాని మీవంటి పుణ్యాత్ముల పక్కనుంటే నన్ను దేవుడేమీ చెయ్యడు. నా ఒక్కడిమూలంగా మీరు నలుగురు నష్టపడతారా? దేవుడంత అన్యాయం చెయ్యడు!" అని రాముడు బతిమాలాడు.

వాడు చలికి వణుకుతూ, దణ్ణాలుపెట్టి బతిమాలుతున్నకొద్దీ యాత్రికుల గీర్వాణం మరింత ఎక్కువయింది. ఆఖరుకు వాళ్ళు నలుగురూ చేరి రాముణ్ణి వానలోకి నెట్టేశారు. వాడు పరిగెత్తిపోయి దూరాన ఉన్న ఒక చెట్టుకిందికి వెళ్ళి నిలబడ్డాడు. మరుక్షణమే ఆకాశం పగిలినట్టు చప్పుడై పెద్ద వెలుతురయింది. రాముడు కళ్ళు గట్టిగా మూసి తెరిచేసరికి ఎదురుగా దేవళం లేదు. రాళ్ళగుట్ట మాత్రమే ఉంది. ధనగుప్తుడితోపాటు ముగ్గురు యాత్రికులూ పిడుగువాతపడి చనిపోయారు.



హాస్యకథ

# చాటింపు!

ఒక బౌద్ధదేవాలయంలోని మఠంలో భిక్షువొకడుండేవాడు. వాడు వట్టి మూర్ఖుడు. వాడొకనాడు వీధిన పోతూండగా కుక్క ఒకటి ఎక్కడినుంచో వచ్చి వాడిమీద పడి, వాడి మోకాలు కరిచింది. మోకాలు గాయమయింది.

"ఈ గాయం ఎందుకయింది?" అని నన్ను ఎంతమందో అడుగుతారు. గాయం మానినదాకా అడుగుతూనేవుంటారు. ఇంతమందికి నేనెక్కడ జవాబు చెబుతూవుండేది? అందుచేత వెంటనే అందరికీ ఒక్కసారే జరిగినదంతా చెప్పేస్తాను," అనుకున్నాడు ఆ మూర్ఖుడు.

వెంటనే వాడు మఠానికి తిరిగివచ్చి, డప్పు ఒకటి తీసుకుని, మఠంమీది కెక్కి డప్పు వాయించాడు. కొద్దిసేపటిలోనే చాలామంది చేరారు. వాళ్ళలో కొందరు, "ఏమిటి విశేషం? ఎందుకు డప్పుకొడుతున్నావు?" అని అడిగారు.

"అందరూ శ్రద్ధగా వినండి. ఇంతకుముందే నేను వీధివెంట వెళ్ళుతుండగా ఒక కుక్క నామీదపడి మోకాలు కరిచింది! ఇదుగో గాయం!" అన్నాడు మూర్ఖభిక్షువు.

"ఈ భాగ్యానికే ఇంత ఆర్భాటంగా చాటింపు వేశావా, నాయనా?" అని తిట్టుకుంటూ అందరూ వెళ్ళిపోయారు.



హాస్యకథ

# ప్రాణంకన్న ఎక్కువైన పాయసం

పరమలోభి అయిన మూర్ఖుడొకడుండేవాడు. వాడూ, వాడి భార్యాకూడా రెండు పూటలా ఉప్పుకూడా వేసుకోకుండా పేలపిండి తిని కడుపు నించుకునేవారు. అలాటి పరమలోభికి ఒకనాడు పాయసంమీద బుద్ధిపోయింది. వాడు తలవాకిలి గడియపెట్టి భార్యచేత పాయసం కాయించసాగాడు.

ఇంతలో ఒక స్నేహితుడు వచ్చి తలుపు తట్టాడు, లోభి భార్య వెళ్ళి తలుపుతీసింది.

"మీ ఆయన ఉన్నాడా?" అని అడిగాడు వచ్చిన స్నేహితుడు.

లోభి భార్య ఏమీ చెప్పక భర్తవద్దకు వెళ్ళి, అతనికోసం ఎవరో వచ్చినట్టు చెప్పింది.

"పిచ్చిదానా, నేను చచ్చిపోయినట్టు పడుకుంటాను. నువు నా కాళ్ళమీదపడి ఏడుస్తూండు. వాడు వెళ్ళాక పాయసం తిందాం!" అన్నాడు లోభి

ఇంతలో స్నేహితుడు లోపలికివచ్చి లోభి చచ్చినట్టు పడుకుని వుండటమూ, అతని భార్య మొగుడి కాళ్ళమీదపడి ఏడుస్తూండటమూ చూశాడు. వంటయింటోనుంచి పాయసం వాసన కొడుతోంది.

ఇదేదో దొంగయెత్తని గ్రహించి, వచ్చిన స్నేహితుడు, "అయ్యో, స్నేహితుడా! అప్పుడే పోయావా!" అంటూ గొంతెత్తి ఏడుపు ఆరంభించాడు. ఈ ఏడుపు విని లోభి బంధువులంతా వచ్చారు. వాళ్ళు లోభివాణ్ణి దహనంచెయ్యటానికి ఏర్పాట్లుకూడా చేశారు.

"ఏమండీ? ఇప్పుడన్నా లేవండీ?" అన్నది భార్య లోభి చెవిలో.

"చాల్లే ఊరుకో! ఇప్పుడు నేను బతికానంటే వీళ్ళందరికీ పాయసం పంచాలి!" అని కేకపెట్టి లోభి మళ్లీ చచ్చినట్టు పడుకున్నాడు.

వాడి మూర్ఖతకు నవ్వుకుంటూ ఎక్కడివాళ్ళక్కడ వెళ్ళిపోయారు.



నీతి కథ

# గుమ్మడికాయలంత ఉండ్రాళ్లు

ఒక మూఢుడు ఒకనాడు పురాణం వింటూంటే అందులో, కొలను తవ్వించినవారికి పరలోకంలో అంతులేని భోగాలు లభిస్తాయని వచ్చింది. వెంటనే ఆ మూఢుడు తనకున్న ఆస్తి యావత్తూ అమ్మి ఒక కొలను తవ్వించి, దానికి నాలుగువేపులా ఇటుకలతో గట్లు కట్టించాడు.

అతను ఒకనాడు కొలనుకు వెళ్ళి చూసేసరికి గట్టు ఒకపక్క పగిలివున్నది. మర్నాడు ఇంకొక పక్క పగిలివున్నది. ఈ పని ఎవరు చేస్తున్నారో చూడాలని ఆ మూఢుడు రాత్రి పూట కొలనుదగ్గిరికి వెళ్లి, అక్కడ గట్టును కుమ్ముతున్న ఎద్దు నొకదాన్ని చూశాడు. వెంటనే వాడు వెనకగా వెళ్ళి ఆ ఎద్దు తోక పట్టుకున్నాడు. మరుక్షణంలో ఆ ఎద్దు ఆకాశంలో లేచి నేరుగా కైలాసశిఖరంమీద వాలింది.



నందికేశ్వరుడి తోక పట్టుకుని కైలాసం వచ్చిన అతిథికి అక్కడివాళ్లు చక్కగా భోజనం పెట్టి, తినటానికి గుమ్మడికాయ లంత ఉండ్రాళ్ళిచ్చారు. తరవాత ఆ మూఢుడు నందికేశ్వరుడి తోక పట్టుకుని మళ్లీ భూలోకానికి వచ్చేశాడు. అతను తన బంధువు లందరినీ పిలిచి తన కైలాస యాత్ర గురించీ, ఉండ్రాళ్లనుగురించీ చెప్పాడు.

"మమ్మల్నికూడా ఎట్లాగైనా ఒక్క సారి కైలాసం తీసుకుపోవాలి!" అన్నారు బంధువులు.

కాదనలేక ఆ మూఢుడు, "సరే ఈ రాత్రి నాతో కొలనుకు రండి. నందికేశ్వరుడి తోక నేను పట్టుకుంటాను. నన్ను మీరంతా పట్టుకోండి. అందరమూ కైలాసం పోదాం!" అన్నాడు.

అంతా అనుకున్నట్టు జరిగింది. నంది ఆకాశంలోకి లేచేసరికి, దాని తోక పట్టుకుని మూఢుడూ, అతనిని పట్టుకుని ఒక బంధువూ, ఆ బంధువును పట్టుకుని మరొక బంధువూ, ఈవిధంగా గొలుసులాగ అందరూ లేచారు. దారిమధ్యను మూఢుణ్ణి పట్టుకున్న బంధువు, "అయితే కైలాసంలో ఎంతెంత ఉండ్రాళ్లున్నాయన్నావూ?" అని అడిగాడు.

మూఢుడు నందితోక వదిలేసి తన చేతులు ఎడంగా పెట్టి, "ఇంతంతా!" అన్నాడు.

# తిండిపుష్టి

ఒకప్పుడు గోహా ఒక బిడారువెంట ప్రయాణంచెయ్యటం తటస్థించింది. మజిలీ చెరగానే అందరూ భోజనాలకు కూచున్నారు. ఎడారి ప్రయాణంలో భోజనం దొరకదు. అందుచేత ఉన్న ఆహార పదార్థాలను ఎంచి, పరిమితంగా అందరూ పంచుకు తినాలి.

మనిషికి ఒక రొట్టె ఒక గుడ్డూ చొప్పున తీసుకుని అందరూ భోజనాలకు కూచున్నారు. గోహాకుకూడా అతనివంతు రొట్టే, గుడ్డూ ఇచ్చారు. అయితే గోహా తిండిపుష్టి కలగవాడు. ఆతనిది బానకడుపు. ఒక రొట్టే ఒక గుడ్డూ అతనికి వీమూలా చాలదు.

గోహా తన ఆహారం ముట్టకపోవటం చూసి మిగిలినవాళ్ళు, "గోహా, భోజనం చెయ్యవేం?" అని అడిగారు.

గోహా అనుమానిస్తూ, "నేనుకూడా తినాలిసిందేనా?" అన్నాడు.

"తప్పక తినాలి," అన్నారు వాళ్ళు.

"అయితే, ఇన్ని రొట్టెలూ, ఇన్ని కోడిగుడ్లూ నేను తినలేను. అందుచేత నేను తినితీరాలంటే, మీరంతా తలా ఒక అర రొట్టే, తలా ఒక అరగుడ్డూ ఇవ్వండి నాకు చాలు!" అన్నాడు.

మిగిలిన ప్రయాణీకులు ఈ మాటకు నవ్వి దాచిన ఆహారంలోనుంచి అతనికి మరి నాలుగు రొట్టెలూ, గుడ్లూ ఇచ్చారు.



# న్యాయం

ఒకరోజు ఒక నల్లతోడేలు ఆహారంకోసం వెతికివెతికి విసిగిపోయింది. ఇంతలో దానికొక తెల్లతోడేలు, నోట గొర్రెపిల్లను కరుచుకుని, కనబడింది.

"తమ్ముడూ, మనం మనం ఒకటే. ఆకలి దహిస్తోంది. ఆపత్కాలంలో ఐక్యత అవసరం, గొర్రెపిల్లలో సగభాగం నాకిచ్చెయ్యి," అన్నది నల్లతోడేలు.

"గొర్రెపిల్లను తినాలంటే సంపాదించుకో. ఇది నాది. చచ్చినా ఇందులో నీకు భాగం పెట్టను!" అన్నది తెల్లతోడేలు.

కాని రెంటిలో నల్లతోడేలే బలమైనది. అందుచేత అది బలాత్కారంగా గొర్రెపిల్లను కాజెయ్యా లనుకున్నది. రెండూ గొర్రెపిల్లను చెరొక చివరా పట్టుకు గుంజసాగాయి. అసలుకే మోసం వచ్చేట్టు కనిపించి, తెల్లతోడేలు, "ఇది న్యాయవిరుద్ధం! చట్టవిరుద్ధం!" అని అరిచింది.

ఈ మాటలు వినేసరికి చచ్చిపోబోతున్న గొర్రెపిల్లకు కొంచెం ప్రాణం వచ్చినట్టయి, "అయ్యా? న్యాయమంటే ఏమిటి?" అని అడిగింది.

"నోరుమూసుకో! ఇందులో నీ ప్రసక్తి ఏమీలేదు," అన్నది తెల్లతోడేలు.



# తారతమ్యం

ఒక జోరీగ ఒక ఎద్దు కొమ్ముమీద వాలి కొంతసేపు కూచుని, ఎద్దుతో చెప్పి పోదామనే ఉద్దేశంతో, "ఇక వెళ్ళిరానా?" అని అడిగింది.

"నువ్వెప్పుడు వచ్చావో నాకు తెలీదు, నువు వెళ్ళిపోతే నేను గమనించ బోను!" అన్నది ఎద్దు.

—ఈసప్

నీతి కథ

## పొరబాటా? గ్రహపాటా?

ఒకమనిషి చాలాదూరం ప్రయాణంచేసి అలిసిపోయి ఒక బావి అంచున పడుకున్నాడు. నిద్రలో ఆ మనిషి బావిలో పడబోయే సమయానికి అదృష్టదేవత అతన్ని తట్టిలేపి, "కొంచెం అవతలగా పడుకో, బాబూ! నీ బుద్ధితక్కువ మూలంగా బావిలో పడ్డావంటే నిష్కారణంగా నన్ను ఆడిపోస్తావు!" అన్నది.

—ఈసప్




## పనికిమాలిన బంగారం

ఒక పరమ లోభి తన ఆస్తియావత్తూ అమ్మి ఆ డబ్బుతో ఒక బంగారం ముద్ద కొన్నాడు. దానిని రహస్యంగా ఒకచోట దాచి, రోజూచూసి ఆనందిస్తూండేవాడు. ఈ సంగతి కనిపెట్టి ఎవడో దాన్ని ఒకనాడు కాజేశాడు. బంగారం పోయిందని తెలుసుకుని లోభివాడు ఏడుపు మొదలుపెట్టి జుట్టు పీక్కోసాగాడు.

ఇదిచూసి దారేపోయేవాడొకడు, "ఇప్పుడు నీకువచ్చిన నష్టమేమిటి? నువ్వా బంగారాన్ని దాచిపెట్టుకున్నావేగాని ఉపయోగించదలచలేదు. అందుచేత అది పోవటంవల్ల నీకు కలిగిన ఇబ్బంది ఏమీలేదు. బంగారంస్థానంలో ఒక రాయిపెట్టుకుని, అదే బంగారమనుకుని సంతోషించు!" అని సలహా ఇచ్చాడు.

—ఈసప్

నీతి కథ

# నక్కా—కుందేలూ

పూర్వం ఒక కుందేలు ఒక విశాలమైన బొరియలో నివసిస్తూండేది. ఈ కుందేలు మీద ఒక నక్క చాలాకాలంగా కన్నువేసి వుంచింది. కుందేలును పట్టటానికేన్నో యుక్తులు పన్నింది. కాని కుందేలుమీద నక్క జిత్తులేమీ పారలేదు.

చివరకు నక్క, కుందేలును పట్టటానికి ఒక గొప్ప ఉపాయం ఆలోచించింది. కుందేలు ప్రతి ఉదయమూ ఒకదారివెంట షికారుకు వస్తుంది. ఆ దారిలో నక్క కొంత తారుపూసి, దానిపైన పచ్చిగడ్డి తెచ్చివేసింది. మర్నాడు ఉదయం కుందేలు తన అలవాటుప్రకారం షికారుకు వెళ్లినప్పుడు తారులో దాని కాళ్ళు అంటుకుపోయాయి. కుందేలు గడ్డిని తొలగించి చూసేసరికి తారు కనిపించింది. చేసేదిలేక కుందేలు తారులో అలాగే వుండిపోయింది.

ఇంతలో నక్కవచ్చి కుందేలును చూసి, తన యుక్తి పారినందుకు పరమానందం చెంది, చితుకులు తెచ్చి పక్కనేవేసి మంటచేయసాగింది.

"నక్కబావా, నక్కబావా! దయచేసి మంట ఇంతదగ్గరలో చెయ్యవద్దు. నాకు నిప్పు చూస్తే చెడ్డభయం!" అన్నది కుందేలు.

"భయపడితే ఎలా? నిప్పుకు ఇంకా చాలాదగ్గిరిగా రావలసివున్నావే!" అన్నది నక్క, నిప్పు నుకుందేలుకు కొంచెం కొంచెమే దగ్గిరికి తోస్తూ.

చివరకు ఆ బుద్ధిలేని నక్క నిప్పును కుందేలుకు ఎంత దగ్గిరగా తెచ్చిందంటే కుందేలు కాళ్ళను పట్టివున్న తారు కరగనారంభించింది. ఉన్నట్టుండి కుందేలు చెంగున ఒక్క గంతువేసి, "నక్కబావా! నక్కబావా! నా ప్రాణం కాపాడినందుకు పదివేల నమస్కారాలు!" అంటూ తన బొరియలోకి దూరిపోయింది. నక్క తెల్లముఖంవేసింది.



హాస్యకథ

## గర్భశత్రుత్వం

ఇద్దరు విరోధులు ఒకే పడవలో ప్రయాణంచేయటం తటస్థించింది. వారు గర్భశత్రువులు కావటంచేత పడవ చెరిఒక చివరా కూచున్నారు.

ఇంతలో పెద్ద తుఫానురేగి పడవ మునిగిపోయే పరిస్థితి ఏర్పడింది. చుక్కానిదగ్గిర కూచున్నవాడు, చుక్కాని పట్టేవాణ్ణి, "పడవ ముందుభాగం ముందు మునుగుతుందా, వెనకభాగం ముందు మునుగుతుందా?" అని అడిగాడు. "ముందుభాగమే ముందు మునుగుతుంది," అన్నాడు చుక్కాని పట్టేవాడు.

"భేష్! ఆ దుర్మార్గుడు చావటం కళ్ళారా చూసి మరీ చస్తాను!" అన్నాడు చుక్కానిదగ్గిర కూర్చున్న మనిషి.

—ఈసప్



## ఆత్మశ్లాఘ

ఒకమనిషి తన గొప్పతనాన్ని తానే మెచ్చుకుంటూ కొంత చెత్తరాసి ఈసప్‌కు తెచ్చిచూపి, ఆయన అభిప్రాయం అడిగాడు.

"నిన్ను నీవే మెచ్చుకోవటం భావ్యంగానే ఉన్నది. ఎందుచేతనంటే నీ రచనను మరెవరూ మెచ్చుకునే అవకాశంలేదు!" అన్నాడు ఈసప్.

## శాంతిమార్గం

మహాబలుడైన హిరాక్లిస్ ఒకనాడు దారివెంబడి పోతూండగా అతనికి దారిలో ఒక చిన్న కాయలాటిది కనిపించింది. హిరాక్లిస్ దానిమీద కాలుపెట్టి తొక్కాడు. వెంటనే అది రెట్టింపు ప్రమాణానికి పెరిగింది. అతనికి కోపంవచ్చి దానిని తన గదతో మోదసాగాడు. అంతకంతకూ అది పెద్దదై, అతని దారిని అడ్డుతూ కొండలా పెరిగింది.

అప్పుడు ఎథినా అనే దేవత ప్రత్యక్షమై, "అంతటితో పోనీ, హిరాక్లిస్. ఇది మాత్సర్యం. దీనిని కొట్టినకొద్దీ పెరిగిపోతుంది. ఉపేక్షించి ఊరుకుని తొలగిపోయినట్టయితే అదే అణగారిపోతుంది," అన్నది.

—ఈసప్



## వేళకాని వేళ

ఒక కుర్రవాడు నదిలో స్నానంచేయబోయి ప్రమాదవశాత్తూ ప్రవాహంలో పడి కొట్టుకుపోతూ కేకపెట్టాడు.

ఈ కేకలువిని గట్టుమీద ఉన్న ఒకమనిషి, తొందరపాటువల్ల ఎటువంటి ప్రమాదాలు జరుగుతాయో ఉపన్యసించసాగాడు.

"ముందు నన్ను బయటికి లాగండి. తరవాత మీ ఉపన్యాసం సావధానంగా ఇద్దురుగాని!" అన్నాడు కుర్రవాడు.

—ఈసప్



# పురాతన జంతువులు

**50** కోట్ల ఏళ్ళక్రితం ట్రైలోబైట్, ప్రాణులకు రాజుగా ఏలిందని తెలుసుకున్నాం. ఈ ట్రైలోబైట్‌లు ఏలుబడి సాగిస్తూన్న సమయంలోనే "సముద్రపు కలువలు" పుట్టాయి. వాటి సంఖ్య విరివిగా పెరిగింది.

"సముద్రపు కలువలు" చూడటానికి పువ్వులలాగే ఉండేవి. అడుగున వేళ్ళూ, దానినుంచి సన్నని, పొడుగాటి కాడా దాని చివర తెరిచి ముడుచుకునే రెక్కలూ ఉండేవి. కాని ఇది పువ్వుకాదు—జంతువు. వీటినుంచి పరిణామం చెందిన జంతువులు "క్రినాయిడ్"లు, ఇప్పటికీ ఉన్నాయి.

"శిరఃపాదులు" అనే మరొక రకం జంతువులుకూడా ట్రైలోబైట్‌ల యుగంలో పుట్టాయి. వీటి శరీరాలు గుండ్రని గుల్లలో దాగివుండేవి. తలా చేతులూ అడుగున ఉండేవి. అందుకే వీటికి "శిరఃపాదులు" అనే పేరు వచ్చింది. వీటిలో కొన్నిటి గుల్లలు చుట్టలు చుట్టుకుని గుండ్రంగా ఉంటే, మరి కొన్నిటివి పొడుగుగా, సూటిగా ఉండేవి.

రానురాను "శిరఃపాదులు" ట్రైలోబైట్‌లకన్న చాలా గొప్ప జంతువులుగా పరిణమించాయి. సూటిదేహాలు గల "శిరఃపాదులు" **20** అడుగుల నిడివికికూడా పెరిగాయి. ఇవి ట్రైలోబైట్‌ల ఆధిపత్యాన్ని అంతం చెయ్యటమేగాక వాటిని అవలీలగా భక్షించసాగాయి. ఆకాలపు సముద్రాల కిప్పుడు ఇవే రాజులు. వాటిని జయించగలది ఏదీ లేదు.

"శిరఃపాదుల" ఏలుబడికూడా, ట్రైలోబైట్‌ల ఏలుబడి లాగే, పదికోట్ల ఏళ్ళపాటు అవిచ్ఛిన్నంగా సాగింది. ఆ తరువాత వెన్నెముకగల చేపలయుగం ప్రారంభమై "కశేరుకరహిత" (వెన్నెముక లేని) ప్రాణుల యుగం అంతరించిపోయింది.

"శిరఃపాదుల" నుంచి అవతరించిన ప్రాణులు ఈనాటికికూడా సముద్రాలలో జీవిస్తూనేవున్నాయి.



"శిరఃపాదం"

# గ్రహాలు : గురుడు



గురుగ్రహం సూర్యుడికి సుమారు 48 కోట్ల మైళ్ళ దూరాన ఉన్నది. ఇది భూమికి దగ్గిరగా వచ్చినప్పుడు 37 కోట్ల మైళ్ళదూరమూ, దూరంగా పోయినప్పుడు 60 కోట్ల మైళ్ళదూరమూ ఉంటుంది. దీని చుట్టూ 11 చందమామలు తిరుగుతున్నట్టు మనం అదివరకే తెలుసుకునిఉన్నాం.

* గ్రహాలన్నిటిలోకీ ఇది చాలా పెద్ద గ్రహం. మిగిలిన గ్రహాలన్నీ కలిసినా గురుడితో సమంకావు. దీని నిడివి 90,190 మైళ్ళు; చుట్టుకొలత 21,60,000 మైళ్ళు; దీని ప్రమాణం భూమికి 1300 రెట్లు; బరువు 318 రెట్లు.

* గురుగ్రహం భూమిలాగే తన చుట్టూ తాను తిరుగుతుంది. అయితే అది తిరిగే వేగం భూమికంటె చాలా హెచ్చు. అది సుమారు 10 గంటల కొకసారి ఆత్మప్రదక్షిణం చేస్తుంది.

* గురుగ్రహం సూర్యుడి చుట్టూ సెకండుకు 8 మైళ్ళ వేగాన—అంటే, రోజుకు 771,000 మైళ్ళ చొప్పున, 4332 రోజుల 14 గంటల 2 నిమిషాల కాలంలో ఒకసారి చుట్టివస్తుంది. ఇది గురుడికి ఒక సంవత్సరం—మన సంవత్సరానికి 12 రెట్లు.

* మనకు సూర్యుడినుంచి లభించే వేడిలోనూ, కాంతిలోనూ గురుగ్రహానికి 25 వ వంతుమాత్రమే లభిస్తుంది. అందుచేత ఈ గ్రహంమీద చలి చాలా జాస్తిగా ఉండివుండాలి. ఈ గ్రహంలో ప్రాణులుండే అవకాశం ఏమీలేదు. ఎందుచేతనంటే దాని చుట్టూ ఉండే వాతావరణంలో ప్రాణుల కవసరమైన ప్రాణవాయువు ఉన్నట్టు కనబడదు.

* ఆకాశంలో గురుగ్రహం చాలా ప్రకాశవంతంగా కనిపిస్తుంది. దీనికి కారణం ఇది భూమికి ఎంతోదూరం లేకపోవటమూ, చాలా పెద్ద గ్రహం కావటమూనూ.

* టెలెస్కోప్‌లోనుంచి గురుగ్రహాన్ని చూసినట్టయితే అది పచ్చగా కనిపిస్తుంది, దాని మీద అడ్డచారలూ, కాంతివంతమైన మరకలూ కనిపిస్తాయి. ఈ మరకలలో ఒకటి ఎర్రగా ఉంటుంది. ఇది చాలా పెద్దది. దీని నిడివి 30 వేల మైళ్ళూ, వెడల్పు 7 వేల మైళ్ళూ. మిగిలిన చారల ఆకారాలు మారుతూంటాయిగాని ఇదిమాత్రం మారదు. ఇది అప్పుడప్పుడూ అదృశ్యమయిపోయి మళ్ళీ కనిపిస్తూంటుంది. గురు గ్రహంపై కనిపించే చారలు ఆ గ్రహం మీది వాతావరణంలో కలిగే ప్రవాహాలని శాస్త్రజ్ఞులు ఊహిస్తున్నారు.

## గోడమీది బొమ్మ-4 (అట్టచివరిబొమ్మ)

రాజుగారు తన మృగపక్షిశాఖా మంత్రిని పిలిచి, "నాకు రోజూ ఇలాటి పావురాలే భోజనానికి కావాలి. అందుచేత నువు 'జ్యోతి' దగ్గిరికి వెళ్ళి, రోజూ రెండేసి పావురాలచొప్పున పంపవలసిందని నా ఆజ్ఞగా తెలియజెయ్యి," అన్నాడు.

మంత్రి చ్వాంగ్ ఇంటికి వెళ్ళి, 'జ్యోతి'కి రాజుగారి ఉత్తరువు సవినయంగా నివేదించాడు.

"పావురాలు పంపటానికేమీ అభ్యంతరం లేదు. కాని ముందుగా మీరు ఈ కొండ చరియల్లోఉండే పేదప్రజలపై పన్నులు తీసివేయాలి," అన్నది జ్యోతి.

మంత్రి సరేనని ఒప్పుకోక తప్పిందికాదు.

మర్నాడు ఉదయం "జ్యోతి" కాగితం కత్తరించి రెండు పావురాలుచేసి వాటిని చ్వాంగ్‌కిచ్చి, "వీటిని రాజుగారికి ఇచ్చిరా!" అన్నది.

"వీటినా ?" అన్నాడు చ్వాంగ్ ఆశ్చర్యంగా.

"ఫరవాలేదు, ఇచ్చిరా!" అన్నది జ్యోతి.

చ్వాంగ్ రాజభవనానికి వెళ్ళాడు. జేబులోనుంచి కాగితం పావురాలు పైకి తీశాడు. అవి వెంటనే నిజమైన పావురాలై ఎగరసాగాయి.

మృగపక్షిశాఖా మంత్రి, తదితరులూ వాటికోసం అటూ ఇటూ పరిగెత్తి ఎట్లాగైతేనేం వాటిని పట్టుకున్నారు.

చ్వాంగ్‌నుచూసి రాజుగారికి చాలా కోపంవచ్చింది.

"ఈ పొలంచేసుకునే పశువు నా భవనంలో అడుగుపెడతాడా ? ఎంత మాత్రం వీల్లేదు. రేపటినుంచీ వీడి భార్యే స్వయంగావచ్చి పావురాలను వప్పగించాలి!" అని రాజు అన్నాడు.

అందుచేత మర్నాడు పావురాలను తీసుకుని "జ్యోతి" స్వయంగానే రాజభవనానికి వచ్చింది. ఆమె అందంచూసి రాజుగారు సింహాసనంమీదినుంచి కిందపడినంతపని జరిగింది.

ఆమెతో రాజు, "నీవంటి అందగత్తె పొలంచేసుకునేవాణ్ణి పెళ్ళాడటమేమిటి ? నువు వట్టి పిచ్చిదానివిలా వున్నావు! ఇక్కడే ఉండిపో. నిన్ను నా పట్టపురాణిని చేస్తాను," అన్నాడు.

రాజు యీమాట అనేసరికల్లా—

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1955 డిశెంబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ అక్టొబర్ 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: కాకమ్మగారి సంధ్యావందనాలు

రెండవ ఫోటో: కోడయ్యగారి సూర్యనమస్కారాలు

పంపినవారు: వై. ఇందిరారెడ్డి II ఫారం, C/o శ్రీ వై. సహదేవరెడ్డి, ఇన్స్పెక్టర్, సెంట్రల్ ఎక్సైజ్, చిత్తూరు.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# వార్తలు-విశేషాలు

విశాఖపట్టణంలోని హిందూస్తాన్ నౌకాకేంద్ర విస్తరణ కార్యక్రమం చురుకుగా సాగుతున్నది. ఇంతవరకు యంత్రాల కార్ఖానా, కమ్మరి కార్ఖానాల అభివృద్ధి కార్యక్రమం పూర్తయింది. బయటినుంచి తెప్పించిన అనేక యంత్రాలు వివిధ కార్ఖానాలలో నెలకొల్పబడుతున్నాయి. ఈ నౌకాకేంద్రానికి యింతవరకు ప్రభుత్వం ఒక కోటి పదిలక్షల రూపాయలు చెల్లించింది.

*　　*　　*　　*

ఇండియాలో అణువిచ్ఛేదక యంత్రం (యాటమిక్ రియాక్టర్) నెలకొల్పబడగానే, ఆసియాదేశాల విద్యార్థులకు శిక్షణ సౌకర్యాలు కల్పించబడగలవని ప్రధాని నెహ్రూ లోక్‌సభలో వెల్లడించారు. అమెరికా, బ్రిటన్, ఫ్రా[illegible] దేశాలకు అణుశక్తి పరిశీలనలో శిక్షణకుగాను, ఇండియానుంచి 18 మంది పంపబడ్డారనికూడా ఆయన తెలియపరిచారు.

*　　*　　*　　*

ఆంధ్రప్రభుత్వం పబ్లిక్ వర్క్సుశాఖ, "రీసెర్చి లాబొరెటరీ"ని ఏర్పాటుచేయడానికిగాను, 20 ఎకరాల స్థలం నిర్ణయించబడింది. ఈ లాబొరెటరీని నాలుగైదు సంవత్సరాల మీద అభివృద్ధిచేస్తారు. ఇందుకు దాదాపు 20 లక్షల రూపాయలు ఖర్చు కాగలదు.

*　　*　　*　　*

**1949-50** మొదలుకొని **1954-55** సంవత్సరాలవరకూ, షెడ్యూల్ జాతుల విద్యార్థుల కివ్వబడిన స్కాలర్‌షిప్పుల నిమిత్తం **31,41,609** రూపాయలు వెచ్చించబడినవని లోక్‌సభలో విద్యామంత్రి మౌలానా అబుల్‌కలాం ఆజాద్ వెల్లడించారు.



ఢిల్లీలోని లేడీ హార్డింజ్ మెడికల్ కాలేజీలో ప్రభుత్వం, శిశుచికిత్సా కేంద్రం, విద్యుత్ చికిత్సా కేంద్రం, నెలకొల్పదలచింది. ఇది రష్యన్‌డాక్టర్ల సహాయంతో వచ్చేఏడు స్థాపించ బడగలదని ఆరోగ్యశాఖా మంత్రిణి రాజకుమారి అమృత్‌కౌర్ రాజ్యసభలో వెల్లడించారు. ఈ చికిత్సా కేంద్రానికి అవసరమయే సాధనసామగ్రిని రష్యాయే సప్లయి చేయగలదు.

*          *          *          *

శ్రీకాకుళంజిల్లా, శాలిహుండాలో పురాతత్వ శాఖవారు ఇటీవల జరిపిన త్రవ్వకాలలో క్రీస్తుశకం మూడు నాలుగు శతాబ్దాలనాటి బౌద్ధస్థూప మొకటి బయటపడింది. శాలి హుండాలో క్రీస్తుకుపూర్వం రెండవ శతాబ్దంనుంచి, క్రీస్తుశకం ఎనిమిదవ శతాబ్దంవరకూ బౌద్ధసంఘారామం వెలిసినట్లు దీనివల్ల తెలుస్తున్నది.

*          *          *          *

అమెరికా సహాయ కార్యక్రమాన్ని అనుసరించి, ఇండియా రైల్వేల వుపయోగానికి 450 గూడ్సుపెట్టెలు ఢిల్లీ చేరినవి. అమెరికా, ఇండియాకు చేసే ధనసహాయంలో 4,88,75, 000 డాలర్ల మొత్తం, ప్రత్యేకంగా రైలుపెట్టెల, రైలుఇంజన్ల నిమిత్తం కేటాయించబడివున్నది.

*          *          *          *

ఉత్తరప్రదేశ్, అస్సాం, బీహార్ రాష్ట్రాలలోని వరదబాధితులకు, ఒక్కొక్క రాష్ట్రానికి 400 రూపాయలు, 225 పౌనుల పాలపొడి చొప్పున, ఇండియన్ రెడ్‌క్రాస్‌సొసైటీ ఆంధ్ర శాఖ బహూకరించింది. పశ్చిమ గోదావరిజిల్లా వరదబాధితులకు 8,750 పౌనుల పాల పొడి, ఒరిస్సా వరదబాధితులకు 5,000 పౌనుల పాలపొడినికూడా యిచ్చింది.

*          *          *          *

ఒరిస్సారాష్ట్రంలో వరదప్రమాదానికి గురిఅయిన ప్రాంతాలను సెప్టెంబర్ 23-వ తేదీన ప్రధాని నెహ్రూ పరిశీలించారు. అయన విమానంలో బయలుదేరి కటక్, పూరీ, బాలాసోర్ జిల్లాలలో వరదదెబ్బకు నష్టపడిన ప్రదేశాన్ని రెండుగంటలసేపు చూసి తిరిగివచ్చారు. వరద నష్టానికి గురైనవారికి వెంటనే తగుసహాయం చేయటానికి అన్ని ఏర్పాట్లూ సాగుతున్నవి.



# చిత్రకథ





ఒక ఆదివారం దాసూ, వాసూలు గాలిపటాలు ఎగరవేసేందుకు ఊరిబయటికి బయలుదేరారు. దారిలో దాసు ఒక చిన్నపందెం కట్టాడు. తమ యిద్దర్లో ఎవరు గాలిపటాన్ని ఎత్తుగా ఎగరవేయగలిగితే వాళ్ళకు, రెండోవాళ్లు రెండణాలు చెల్లించాలి. సరే అంటే సరే అనుకుని దాసూ, వాసూలు గాలిపటాలు వదిలారు. వాళ్ళ వెనకనే కూర్చున్న టైగర్, గాలికి నేలబారుగా కొట్టుకుపోతున్న గాలిపటాన్ని కాళ్లతో పట్టుకున్నది. దాసూ వాసూల గాలిపటాలకంటె, టైగర్ ఎగరవేసిన గాలిపటమే బాగా ఎత్తుపోయింది. దాసూ, వాసూలు గెలుపు టైగర్‌దని ఒప్పుకుని, పందెం వేసుకున్న రెండణాలతో దానికి బిస్కట్లు కొనిపెట్టారు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by S. G. Pradhan



బహుమతి
పొందిన వ్యాఖ్య

కోడయ్యగారి సూర్యనమస్కారాలు

పంపినవారు:
వై. ఇందిరారెడ్డి, చిత్తూరు.

CHANDAMAMA (Telugu) OCTOBER 1955 Regd. No. M. 4854




గోడ మీది బొమ్మ - 4